“రండు మన తెల్గురాజు దర్శనము కొఱకు
హృదయ కుసుమాలమాల లర్పించికొనుఁడు
లాజలను జల్లుఁ డాంధ్ర శౌర్యమ్ముమీఁద
తెలుఁగు జండాలు గొనిరండు తలకు నొకటి.”

—ఓరుగల్లుకోట.

# తెలుఁగు వెలుఁగు

"శ్రియః స్వాంకృతి శంఖశక్ర
యో విభు ర్వ్యాలాంఛనం
త న్మురు ర్వ్యసుధో ద్ధార
వరాహ స్స పునాతు వః."

—కొండవరము శాసనము.

# విషయసూచిక

# మా మాట

కాకతీయ సామ్రాజ్యము నకు సంబంధించిన గాథలు గ్రహించి 'తెలుఁగు వెలుఁగు' అను పేర వెలువరించితిమి. మునుముందు తెలుఁగు వెలుఁగును దెసదెసల వెలయింప వలసిన తెలుఁగు బిడ్డల కిది యొకింత యుత్సాహ మొసఁగినను మా కృషి సఫల మని తలంతుము.

—శ్రీనివాస సోదరులు.

# పూర్వరంగము

౧

"జై జినదాసస్వామికి జై" అను నినాదములు దిక్కుల పిక్కటిల్లెను. ప్రజలు గుంపులుగట్టి యొక గుట్టను చేర నరుగుచుండిరి. ఆ గుట్ట హనుమాద్రి యని చరిత్రలోఁ బ్రసిద్ధికెక్కియుండెను. కృష్ణా గోదావరీ మధ్యప్రదేశమునఁగల పెక్కు పుణ్యస్థలములలో నదియొకటి. దానికి సిద్ధాశ్రమ మనుపేరు గూడ వాడుకలో నుండెను. సిద్ధులకుఁ బార్వతీపరమేశ్వరులు సాక్షాత్కరించిన క్షేత్రమని స్థానికుల విశ్వాసము. హిడింబాశ్రమ మనుపేరఁ బరఁగిన ముదిగొండ యచ్చటికి నైరృతి దిక్కుగాఁ గ్రోశత్రయ దూరమున నుండెను. హనుమాద్రికి చేరువలో నొక యూరుగాని పల్లెగాని యప్పటికి వెలసి యుండలేదు. యాత్రికులు చాల దవ్వులనుండి దానిని దర్శించుకొని పోవుచుందురు.

జినదాసస్వామి జైనమతగురువు. ఆతఁడు శిష్యగణముతో నచ్చట పీఠముపెట్టి కొద్దిదినములు మాత్రమే యైనది. ఆ భిక్షుకు లూరూర వాడవాడలఁ దిరిగి జినదాసస్వామి మహిమలను బ్రచారము సేయుచుండిరి. ప్రాంతీయులైన జనులనుదినము స్వామిని సేవించి జైనధర్మముల నాకళించుకొనుచుండిరి. కొందఱి కాతఁడు ప్రత్యక్ష దైవముగ గన్పట్టుచుండెను. నాఁటి జయజయధ్వానముల కదియే కారణము.

జైనాచార్యుఁ డున్నతాసనమునఁ గూర్చుండి మత ధర్మములు నుపన్యసించు చుండెను. ప్రజలు చేతులు జోడించి శ్రద్ధాళురై యాలకించుచుండిరి. అంతలో దూరమున గుఱ్ఱపు డెక్కల టకటకలు విననయ్యెను. ప్రజాసందోహముదృష్టి యా దెస కాకర్షింపఁ బడెను. చూచుచుండఁగనే కొందఱాశ్విక యోధులు గుట్టనెక్కి వచ్చిరి. మోటుగా నున్న వారియాకృతులు, వేషధారణమును వారు కిరాతులని చెప్పక చెప్పు చుండెను. ప్రజలలోఁ గొంత కలవరము చెలరేగెను గాని భీతిల్లఁ దగిన హడావుడి గన్పట్టనందున వారు సద్దుమణిగి యుండిరి.

రాతులల్లంతలో గుఱ్ఱములు డిగ్గి పాదచారులై వచ్చిరి. ముందు నడచునాతఁడు గుంపు నాయకుఁడు కాఁబోలు! ఆతఁడు రాచఠీవి యుట్టిపడు ప్రత్యేకమైన దుస్తులు కలిగియుండెను. వారందఱు జైనభిక్షుకుని పీఠము ముందు సాగిలఁబడి మ్రొక్కి వినమ్రులై నిలువఁబడిరి.

జినదాసస్వామి వారిపై దీవనలు కురిపించి "అయ్యలారా! మీ రెవ్వరు? మీయాగమనమునకు హేతువెయ్యది?" అని ప్రశ్నించెను.

ఆ యోధవరులలో నొక్కఁడు "స్వామీ! శ్రీశైల ప్రాంతమునందలి యరణ్యభూములు మాకునికిపట్టులు. వీరుగో! మాయేలిక యెఱుకు దేవరాజులుంగారు" అని తమనాయకుని జూపెను.

ఎఱుకు దేవరా జంతలో నందుకొని "యతీంద్రా! ఈ తెనుఁగునాఁడు ప్రాంతములు తగిన నాథుఁడులేక యరాజ

కమునకు లోనై యున్నవి. దారిదోపిడులకు, స్వార్థపరులైన రాజుల దాడులకు ప్రజలు నలిగిపోవు చున్నారు. ప్రబలమైన తెనుగురాజ్య మొండు స్థాపింపవలెనని నాయభిలాష. దుర్గ నిర్మాణము గావించి రాజధానిగఁ జేసికొనుట కనువైన ప్రదేశ మునకై గాలింపు గంగవలెఁ దిరుగుచున్నాను. తాము మహాత్ములు. దివ్యదృష్టిని జూచి యెద్దియైన నిర్ధరింపఁ జాలరా?" అని విన్నవించెను.

ఎఱుకుదేవరాజు పలుకులకుఁ బ్రజలు త్తేజితులైరి. వారప్పటికప్పుడు తెనుగురాజ్యమును స్థాపించినట్లే తీయని కలలు గనఁజొచ్చిరి. జినదాసస్వామి రవంతసేపు ధ్యానముద్రను పట్టెను. కనుచూపుమేఱ వాతావరణమంతయుఁ బరికించెను. శిరఃకంపనము గావించెను. అతని మనస్సున నేదో యూహా తళుక్కున మెఱసెను. అతఁ డెఱుకుదేవరాజున కిట్లనెను.

"నీ యభిలాష నా కెంతయు మెచ్చుగొల్పినది. అదృష్ట దేవత నీకై అఱ్ఱులుసాఁచి యున్నది. నే నియ్యెడ నడుగు మోపినప్పటినుండి పరిసరములను శ్రద్ధగా గమనించుచున్నాను. ఈ ప్రదేశమున నొక దుర్గము నిర్మించిన శత్రువుల కభేద్యముగ నుండఁగలదని యంచనాలు వేయుచుంటిని. నేఁడు నీతో సమాగమము కాకతాళీయముగ జరిగినది. ఎల్లి సుముహూర్తము. జాగుసేయక రాజధానికి శంకుస్థాపన జరిగింపుము. నా యోపినంతవట్టు తగుసలహాల నొసంగఁగలను".

ఎఱుకుదేవరాజు పరివ్రాజకునకుఁ బునఃపునః ప్రణామములు చెల్లించెను. పిమ్మట నాతఁడు ప్రజల దిక్కు మొగమై

"మీయందఱి సహకారమునఁగాని దుర్గనిర్మాణము ఒక్కయంగుళమైన జరుగదు. జినదాసస్వామి స్వయముగ మనకు మార్గదర్శకుఁడు కాఁగలఁడు. ఎల్లి యాంధ్రపతాక నెగురవేయుదము. ఈ చిన్నరాజ్యమే యొక సామ్రాజ్యముగఁ బరిణమించునేమో ! యెవరు చెప్పఁగలరు ?" అని హెచ్చరించెను.

"ఎఱుకుదేవరాజునకు జై ; జినదాసస్వామికి జై" అను జయఘోషలు దిక్కుల మాఱుమ్రోఁగెను. ఎఱుకుదేవరాజు కార్యశూరుఁడు. అనతికాలముననే యాతని కృషి ఫలించెను. హనుమాద్రిపై నొక దుర్గమును, దాని నానుకొని పట్టణమును దలయెత్తెను. రాజధాని కావశ్యకములగు హంగులన్నియు నేర్పడెను. ఎచ్చటెచ్చటనుండియో ప్రజాసందోహ మచ్చటికి వలసవచ్చి నగరమునకు రూపురేఖలు దిద్దిరి. చతురంగబలములు సమకూర్పఁబడెను.

ఎఱుకుదేవరా జొకశుభముహూర్తమున నందు పట్టము గట్టుకొనెను. అసాధారణమైన పరాక్రమమునెఱపి రాజ్యమును విస్తరింపఁజేసెను. ధర్మమును నాల్గుపాదములపై నడపి ప్రజల యనురాగమును చూఱఁగొనెను. ఈ కాలమున జైనులనేకులు వచ్చి స్థిరనివాసములఁ గుదుర్చుకొనిరి. పద్మాక్షీదేవి యాలయమున్న గుట్టపై జైన శిలావిగ్రహములఁ బ్రతిష్ఠించిరి.

ఎఱుకుదేవరాజున కనుమఁడు, కొండఁడు నను నిరువురు పుత్రులుండిరి. అసహాయశూరులని వారు ప్రఖ్యాతిఁబడసిరి. నూతన రాజధాని యా యుభయులపేర 'అనుమకొండ' యని పిలువఁబడెను.

"రక్షింపుఁడు, రక్షింపుఁడు, దిక్కులేని పక్షిని" అని విలపించుచు నొకయువతి మాధవశర్మ పాదములపైఁబడెను. జలజలరాలు కన్నీటితో నాతని యడుగులు తడిసిపోయెను.

ఆ యిల్లాలు మధ్యమవయస్క. నిండుగర్భిణి. నివురు గప్పిన నిప్పువలె నామె ధూళిచే గొట్టుమిట్టాడుచున్నను జగదేక సుందరిగఁ గన్పట్టుచుండెను. విచారభారమున నామె క్రుంగియున్నను ఆమె ముఖమున రాజసము తొణికిసలాడు చుండెను.

మాధవశర్మ అనుమకొండలోని బ్రాహ్మణాగ్రహారము నకు కులపతి; షట్కర్మనిరతుఁడు. ఆయనమాట ప్రజలందఱకు శిలాక్షరము. అగ్రహారమున నాతని పలుకు సుగ్రీవాజ్ఞ. ఆనాఁడేదో ముఖ్యసమస్యపై చర్చ జరుగవలసి యుండెను. అందుచే భూసురులలోఁ బ్రధానులంద ఱాతనియింట సమావేశమైరి. ఆ మానవతి దీనవదనమునుగాంచి వారి కడుపులు తఱుగుకొని పోయెను.

మాధవశర్మ యానారీమణింగాంచి "నాబొందిలో ప్రాణ ముండునంతవఱకు నీపై నీఁగ వ్రాలనీయను. సిద్ధేశ్వరుఁడు మన పాలిటనున్నాఁడు. నిర్భయముగ నీదుఃఖగాథ నెఱింగింపుము" అని యభయ మొసంగెను.

ఆసుందరి సిరియాలదేవి; కందారరాజపత్ని. నందగిరి (నాందేడు) రాజధానిగ తెనుఁగుసీమఁ బాలించిన విజయపాలుఁడను రాజునకు సోమదేవరాజు, ఎఱుకుదేవరాజు నని యిరువురు పుత్రులుండిరి. అన్నదమ్ముల విభాగములలో సోమదేవరాజునకు కందారమును, ఎఱుకుదేవరాజున కనుమకొండయు వచ్చెను. ఎఱుకుదేవరాజన అనుమకొండ నిర్మాతయైన తొల్లిటి వాఁడని మనము భ్రమింపరాదు.

సోమదేవరాజు చిచ్చఱపిడుగు; పండితపక్షపాతి; ధర్మప్రభువు. సిరియాలదేవి యాతని కన్నిటఁ దగినయిల్లాలు. ఆయనకుఁ బ్రాణమొకయెత్తు; గోధనమొకయెత్తు. ఆలమందలన్నియు భద్రాచలము, మంత్రకూటము మున్నగు ప్రదేశములలో వృద్ధియగుచుండెను. గోపాలురు వానిని గడుజాగరూకులై పెంచుచుండిరి. రక్షకభటులు సర్వదాఅప్రమత్తులై వానిని గని పెట్టియుండిరి.

కందారమునకుఁ బొరుగురాజ్యము కటకము. ఆనాఁడు బల్లహుఁడు దానియధిపతి. అసహనము ముందుపుట్టి పిమ్మట కటకేశ్వరుఁడు పుట్టెను. కడుపుబ్బు దీర్చుకొనుట కాతఁడెట్టియకార్యమునకైనఁ బాల్పడుచుండెను. సోమదేవరాజు కీర్తిప్రతిష్ఠలాతనికి కన్నెఱ్ఱయయ్యెను. కందార రాజ్యవైభవమును చారులు వర్ణించునప్పు డాతనిమేన తేళ్లు, జెఱ్ఱులు ప్రాకుచుండెను. సోమదేవరాజుపై నిర్హేతుకముగ పగఁబూని యాతఁడు తఱి వేచియుండెను. సరిహద్దులను బరిశీలించు నెపమున నాతఁ డొకనాఁడు పొలిమేరలలో విడిసియుండెను. సమస్తసైన్యములు

యుద్ధసన్నద్ధములై కూతవేటు దూరమునఁ బ్రచ్ఛన్నముగ నిలుపఁబడెను.

గిల్లికజ్జా పెట్టుకొనఁ జూచువానికి కారణములపై కారణము లేవో పొసగుచునే యుండును. ఆనాఁడు సోమదేవరాజు గోగణము కందారపుఁబొలిమేరలలో మేయుచుండెను. గోపాలు రెంతమెలకువతో మళ్లవేయుచున్నను, కొన్ని తప్పిదారి సీమల నతిక్రమించెను. తమ కడుపాత్రమేమో, తమతిండియేమో కాని రాజ్యముల స్వపరములు, సరిహద్దుల గొడవలు వానికేమిపట్టి నవి? అవేమి పాఠశాలలోచేరి చరిత్రలు, భూగోళములు వల్లె వేసినవి గనుకనా? పశుపాలకు లంతలోనే వచ్చి మళ్లించు కొని పోయిరి.

కటకేశ్వరునకు వెనుకఁబోయిన తీఁగ కాళ్లకుఁ జుట్టు కొనెను. ఆతఁడీ యదను వృథపుచ్చక గోగణమును పాదివి పట్టుకొనుఁడని సేనలకాజ్ఞయిచ్చెను. యాదవుల మొఱలు చెవిటివానికడ సంకూదినట్లయ్యెను. కందారపుఁ బొలిమేర భటులు విక్రమించిరి కాని యెదిరిసైన్యములధాటి కోహటింప లేకపోయిరి.

సోమదేవరా జీవార్త నాలకించి మండిపడెను. మంత్రులు కన్నులనిప్పులురాల్చిరి. దండనాథులు మీసములు మెలిబెట్టి కత్తులు దూసిరి. అంతలో బల్లహుని రాయబారి యొకసందేశ మును గొనివచ్చెను. అందిట్లుండెను.

"కందారరాజ్యాధిపతి సోమదేవరాజునకు కటకేశ్వరుఁడు బల్లహుఁడు వ్రాయునది.

మాసమ్మతిలేకుండ మీ యాలమందలు మాపొలిమేర బీళ్లలో మేతమేసినవి. ఈ దురాక్రమణమును సహింపఁజాలక వానిని బంధింపవలసి వచ్చినది. పుల్లరితోఁబాటు అపరాధమునుగూడ చెల్లించి మీ పశుగణమును విడిపించుకొనవలెను. లేదా, దాడిచేసియైన మేమే వసూలుచేసికొందుము.

ఇట్లు
కటకేశ్వరుఁడు"

బల్లహుని లేఖ మగనికొట్టి మొఱబెట్టినట్లుండెను. సోమదేవరాజు దానిని ముక్కలుగ జించివైచి "మీకోర్కెను మేమేలత్రోసిపుచ్చి మిమ్ములను చిన్నబుచ్చవలెను? ఈసమస్యను రణాంగణముననే తేల్చుకొందముగాక!" యని జవాబొసంగి వార్తాహరుని వీడ్కొలిపెను. కందారము వ్యవధిలేని రణసన్నాహములతో నుక్కిరిబిక్కిరయ్యెను.

ఆవఱకే సంసిద్ధములై యున్న కటకసైన్యము సముద్రమువలె కందారముకోటను చుట్టివైచెను. సోమదేవరాజు లయరుద్రునివలె నెక్కడఁజూచిన తానయై వీరవిహారము సలిపెను. నేల యంతయుఁ బీనుఁగుపెంటలయ్యెను. నెత్తురేరులు ప్రవహించెను. కాని జయాపజయములు దైవాధీనములుగదా! సోమదేవరాజుపై దైవము చిన్నచూపు జూచెను. అఱువది

దినములు హోరాహోరిగఁ బగతుఱ నుక్కడంచి తుదకాతఁడు వీరస్వర్గ మలంకరించెను.

సిరియాలదేవి నిండుచూలింత. శత్రువులు రాణివాసము సొరకమున్నే యాసాధ్వి రహస్యమార్గమున కోట విడిచిపోయెను. ఆమె తిన్నఁగా అనుమకొండకుఁ జేరుకొని మఱఁదిగదాయని యెఱుకు దేవరాజును శరణువేడెను. బలవద్విరోధమేల యని యాతఁడు తన యసమర్థతను వెల్లడించెను. మీఁదుమిక్కిలి తన పట్టణము విడిచిపొమ్మని యామెను తొందరపెట్టెను. ఆమె చేయునది లేక దైవవిధి ప్రేరేప మాధవశర్మ ముంగిట వచ్చి వ్రాలెను.

సిరియాలదేవి దుఃఖగాథ విని బ్రాహ్మణ్యా మట్టుడికి పోయెను. "ఈమె కాశ్రయమిచ్చుట చేతులార నింటికి చిచ్చు పెట్టుకొన్నట్లే. ఈ రాజకీయములలో మనము తలదూర్పనేల?" అని కొందఱు భీతిచెందిరి. "కావలసినవాఁడు, సాటిరాజునైన యెఱుకు దేవరాజే విడిచిపుచ్చినప్పుడు మనమేమి చేయగలము?" అని మఱికొంద ఱసమర్థతను వెల్లడించిరి. "కటకసైన్యమును నిలువరించునవి మన యంగవస్త్రములు? బుడ్డిచెంబులునా?" యని వేఱొక కొందఱు పిఱికిమందు వోసిరి.

మాధవశర్మ మేఘగంభీరస్వరమున నిట్లు గర్జించెను. "బాసచేసి తప్పుట పాడిగాదు. శరణాగత రక్షణమే భారత ధర్మము. ఫాలాక్షుఁడెదిర్చినను మన ప్రాణముల బలిపెట్టియైన సిరియాలదేవిని గాపాడవలసినదే. 'ఇదంబ్రాహ్మ్యం, ఇదంక్షాత్రం' అనెడి మన పూర్వులనుడి వమ్ముగారాదు. సోమదేవరాజు

ధర్మప్రభువు. ఆతని వంశాంకురమును రక్షించుట మన కర్తవ్యము.''

మాధవశర్మ వాదమునకు బ్రాహ్మణ్యమౌనౌనని తల లూచిరి. ఈ సంగతి పరమగోప్యముగ నుంచుటకు వారేకగ్రీవముగ నిర్ణయించిరి. నాఁటనుండి సిరియాలదేవి యాగృహముఁన ప్రచ్ఛన్నముగ దినములు వెళ్ళబుచ్చుచుండెను. మాధవశర్మ యామెను కన్నకుమార్తెవలె సాదరముగఁ జూచుచుండెను.

కటకేశ్వరుఁడు కోటను లోఁబఱచుకొని సిరియాలదేవికై యిల్లిల్లు సందుగొందులు వెదకించెను. జాడలు తీయగా నామె యనుమకొండకుఁ బాఱిపోవుట తెలియవచ్చెను. బల్లహుని సైన్యములు వెంటనే యనుమకొండను ముట్టడించెను. ఎఱుకు దేవరాజు కటకాధిపతి కిట్లు రాయబార మంపెను.

"సిరియాలదేవి మానగరమునలేదు. అనుమానము తీరనియెడల మీసైన్యము లిల్లిల్లు సోదా చేసికొనవచ్చును. నా యభ్యంతరములేదు. కాని వారు నిరాయుధులై లోన నడుగుపెట్టవలెను. ఆమె కనుపించిన మీరు బలిమిని గొనిపోవుటకు మే మడ్డుపడువారము కాము.''

ఈ పద్ధతికి బల్లహుఁ డియ్యకొనెను. వెంటనే యాతని సైనికులు అంగుళముమేర విడువకుండ పురమంతయు గాలించివైచిరి. కడకు వారు మాధవశర్మ గృహమున సిరియాలదేవిం గాంచి, యామె కందారరాజపత్ని కానోపునని యూహించిరి. ఆమెను తమవశ మొనర్ప వలసినదిగా సైనికులు మాధవశర్మను కోరిరి. మాధవశర్మ యుగ్రుఁడై "ఇదియేమియాగడము. ఈమె

నా కుమార్తె. మనుజులనుబోలు మనుజులుండరా యేమి ?'' అని ధిక్కరించి పలికెను. ఆమె ముఖమున రాజకళ యుట్టిపడుచుండుటచే భటులాతని మాటల సరకుగొనరైరి. మట్టుమర్యాదల నవలఁద్రోచి వారామెను బలాత్కారముగ వెంటనిడుకొని పోయిరి. అగ్రహారమంతయు వారివెంట గదలిపోయెను.

రాజభటులు సిరియాలదేవిని కటకేశ్వరుని మ్రోల హాజరుపెట్టిరి. "ఎవరో రాజకాంతయని బ్రాహ్మణ పుత్రిక నెత్తికొనిపోయెదరా ? సౌందర్య మొక్క క్షత్రియస్త్రీలే గుత్తగొనిరాయేమి ?'' అని బ్రాహ్మణులందఱు నేకకంఠమున బల్కిరి. మాధవశర్మ "రాజా ! ధర్మమును బాలింపవలసిన ప్రభువుల కిట్టి యవినీతి తగదు. నిండుగర్భిణియైన నా కొమరితను ఱచ్చకీడ్చి యేలపాపము మూటగట్టుకొందువు ? సాధుహింస నిప్పుతోఁ చెఱలాటవంటిది సుమా !'' యని హెచ్చరించెను.

కటకాధిపుఁడు నిలువున కంపించెను. ఆతఁడు యుక్తియుక్తముగ "సరే ! ఈమె నీకుమార్తెయే యనుకొందము. ఈమె చేతివంటకమును మీరు భుజించుట కడ్డంకి లేదనుకొందును'' అని సగర్వముగఁ బలికెను.

"ఓయి వెఱ్ఱిరాజా ! కూఁతురుచేతి వంటకము తినని తండ్రి యుండునా ? కాని శ్రోత్రియులకు గర్భిణిచేతియాహారము నిషిద్ధము. శాస్త్రనియమముల నుల్లంఘించుట పాపహేతువు'' అని మాధవశర్మ వాక్రుచ్చెను.

బల్లహుని మంత్రి జోక్యము కలిగించుకొని "బ్రాహ్మణోత్తములారా! సిద్ధేశ్వరుని సమక్షమున నీమె వడ్డించిన ఘృతమును లవణమును బరిగ్రహింపుఁడు. దాన మా యను మానము రహితము కాఁగలదు" అని నుడివెను.

ఈ పద్ధతికి బ్రాహ్మణులందఱ నామోదించి యట్లొనరిపిరి. బల్లహుఁడు సంతసించి సైన్యములతోఁ గటకమునకు మఱలి పోయెను. పాపము! సిరియాలదేవి ప్రాణములు నిలుపఁబడెను.

సిరియాలదేవి కొండొక శుభముహూర్తమున సర్వ లక్షణ సంపన్నుఁడైన పుత్రుని బ్రసవించెను. ఆ శిశువునకుఁ దండ్రి, గురువు, దైవము మాధవశర్మయే. ఆ మహనీయుని నామమే తనపుత్రునకుఁ బెట్టవలసినదని సిరియాలదేవి కోరెను. బ్రాహ్మణులందఱ నాలోచించి రాచబిడ్డఁడగుట నాతనికి మాధవ వర్మయని నామకరణము గావించిరి.

మాధవవర్మ దినదిన ప్రవర్ధమానుఁడై రాజోచితవిద్య లం దెల్ల నాఱితేరెను. అతఁడనుదినము పద్మాక్షీదేవిని సేవించి వరప్రసాదమునుబొంది శూరశిఖామణి యని వాసికెక్కెను. పులికడుపున మేకపిల్ల పుట్టునా? మాధవవర్మ యెఱుకుదేవ రాజును దొలఁగించి యనుమకొండ నాక్రమించెను. పిమ్మట కటకముపై దండెత్తి బల్లహునిజంపి పితృఋణమును దీర్చు కొనెను. అతఁడే కాకతీయరాజులకు మూలపురుషుఁడయ్యెనని చెప్పుదురు.

# 3

మాధవవర్మ తరువాత పద్మసేనుఁడు మొదలగు కొండఱు రాజు లనుమకొండను పాలించిరి. వారిచరిత్ర కాల గర్భమున లీనమైపోయినది. క్రమముగా కాకతిబేతరాజు అనుమకొండ కేలిక యయ్యెను.

అనుమకొండ రాజులు కాకతియను నామముగల దుర్గ నారాధించుచుండెడివారు. అందుచే వారికి కాకతిరాజులు, కాకతీయులు నను ప్రసిద్ధిగలిగెను. వారి రాజధానియగు అనుమ కొండకు కాకతిపురమని పేరువచ్చెను. ఓరుగల్లు నగరము నిర్మింపఁబడి రాజధాని మార్పు జరిగినపిదప దానికిని కాకతి పురాభిధానము వ్యవహృతమయ్యెను.

అనుమకొండకు ప్రాక్పశ్చిమదిశల ప్రాచ్యపాశ్చాత్య చాళుక్యరాజ్యములు ప్రబలముగనుండెను. 'ఉద్ధతులమధ్యమునఁ బేదకుండఁ దరమె ?' అనిగదా పెద్దలు చెప్పుదురు! ఆత్మరక్షణకై కాకతిపురాధిపతులు పశ్చిమచాళుక్యుల సామంతులుగ నుండవలసివచ్చెను.

నాఁటి పశ్చిమచాళుక్యరాజు జయసింహుఁడు. అతనికి చోళులతో యుద్ధము తటస్థించెను. అందు బేతరాజు జయ సింహునకు కుడిభుజముగానిలచి చోళసేనాసముద్రమును మథించి వైచెను. జయసింహుఁడు బేతభూపతినిఁ దన సామంతులలో నధికునిఁగా గౌరవించెను.

బేతరాజు కుమారుఁడు మొదటి ప్రోలరాజు. అతఁడు తండ్రిని మించిన మహావీరుఁడు. అతనికిఁ దగిన దండనాథుఁడు బమ్మిరెడ్డి.

అప్పటి పశ్చిమచాళుక్యరాజు త్రైలోక్యమల్ల సోమేశ్వరుఁడు. అతనికి చక్రకోట్యము, భద్రంగము, కొంకణము జయించుటలో ప్రోలరాజు బాసటగనుండెను. అందులకు సంతసించి త్రైలోక్యమల్లుఁ డాతనికి అనుమకొండవిషయమునంతటిని శాసనపూర్వకముగా నిచ్చివేసెను.

ప్రోలరాజు పరాక్రమగాథలు నలుగడలను వ్యాపించెను. వేంగీచాళుక్యరాజగు కులోత్తుంగచోళుఁడు చోళరాజ్యమును దౌహిత్రభాగముగఁ బడయఁగోరి ప్రోలరాజుసాయముఁగోరెను. ప్రోలరాజు ననుమతిని బమ్మిరెడ్డి మహావాహినులతో కులోత్తుంగు ననుసరించెను. వారు కాంచీపురమును ముట్టడించిరి. తెలుఁగువీరులు నిర్వక్రపరాక్రమమునెఱపి కాంచీపుర కవాటములు భేదించిరి. కులోత్తుంగునకు విజయముగలిగెను.

ప్రోలరాజు ప్రజానురంజకుఁడై యనుమకొండ విషయమును బరిపాలించెను. అతఁ డరికేసరి తటాకమును నిర్మించెను.

ప్రోలరాజు కుమారుఁడు త్రిభువన మల్ల బేతరాజు. అతని సేనాధిపతి వైజదండనాథుఁడు. వీరిరువురును నాఁటి పశ్చిమ చాళుక్యరాజగు విక్రమాదిత్యునకు బాసటగనుండిరి. అతనికి వీరు చోళ, మాళవరాజులతోడి యుద్ధములం దెంతయు సాయమొనర్చిరి. అందు బేతరాజు చూపిన పరాక్రమ మనన్య

సామాన్యము. కావుననే అతనికి పరశువు, విక్రమచక్రి యను బిరుదములు గలిగెను.

వైజదండనాథుఁడు రాజనీతిచతురుఁడు. అతఁడు విక్రమాదిత్యుని బ్రసన్నునిఁజేసికొని బేతభూపతికి సబ్బిసాయిర మండలము నిప్పించెను.

త్రిభువన మల్ల బేతరాజు గురువు రామేశ్వరదీక్షితుఁడు. అతఁడు మహావిద్వాంసుఁడు. అతని బోధలవలన బేతరాజు పరమమాహేశ్వరుఁ డయ్యెను. బేతభూపతి తనపేర బేతేశ్వర దేవాలయము నిర్మింపఁ జేసెను. శివపురమను నగరము కట్టించెను. అనుమకొండలో నొక యుద్యానవనము వేయించెను. తన తండ్రియగు ప్రోలరాజు పేర వరుణప్రతిష్ఠ చేయించెను.

త్రిభువన మల్ల బేతరాజు కుమారుఁడు రెండవ ప్రోలరాజు. అంతవఱకును అనుమకొండరాజులు పశ్చిమ చాళుక్యుల కించుమించు సామంతులుగనే యుండిరి. రెండవ ప్రోలరాజాబంధమును తెగదెంపులుచేసి త్రిలింగ మహాసామ్రాజ్యమునకు పునాదివేసెను.

---

# ౧. పరుసవేది

## ౧

కొన్ని రెండెడ్లబండ్లు బారుగట్టి నడచుచుండెను. బండ్లమీఁద ధాన్యపుబస్తాలు పూటిగా నుండెను. కులగిరులను మోయు ధరణిదేవియోర్పు – ఆపూటిబండ్లనీడ్చు వృషభములదే యోర్పు. సందెజామున గట్టినబండ్లు రాత్రియంతయు నడచుచునే యుండెను. బండివాండ్రు కునికిపాట్లుపడుచు తెలివి వచ్చినప్పుడెల్ల యెడ్లనదలించుచు తోడివారి మొద్దునిద్దురకు పరాచికములాడుచు తాము కునికిపాట్లు పడుచుండిరి. సదా జాగరూకులగు ప్రోలమహామండలేశ్వరుని భటులవలె, చుక్కలు మిక్కిలి హెచ్చరికతో బాటసారుల భద్రము నరయుచుండెను.

తెలతెలవాఱుచుండెను. దిక్కులు తెలివొందెను. పక్షుల కిలకిలారవములు క్రొంగ్రొత్త తెలుఁగు రాజ్యమునకు యుదయమంగళ గీతములు పాడుచుండెను. ప్రోలమహామండలేశ్వరుని యచ్చపుకీర్తి కప్పురపు పరిమళములు వాతావరణము నందెల్ల నలఁతివలపుల గుబాళించుచుండెను. అనుమకొండ మహానగరము కూతవేటుదూరమున నుండెను. రాజసౌధాగ్రము లందలి కనకకలశముల తళతళలు నవారుణ బింబమున కభ్యుత్థానము సలుపుచుండుట కానవచ్చుచుండెను.

బండివాండ్రొడలు విఱుచుకొని లేచి యొకరినొకరు పిలుచుకొనుచుండిరి. రాజధానీనగరము చేరబోవు చుంటిమను

భావము వారిలో నవనవోత్సాహముఁ బెంపొందించుచుండెను. అదివారి చేష్టితములలో మాటలతీరులో పొంగిపొరలుచుండెను. త్వరత్వరగా పలుదోము పుల్లలు విఱుచుకొని ముఖమార్జనము చేసికొనిరి. అదిగో! పద్మాక్షిగుట్ట. ఇఁక రెండుమూడు గడియలలో వారు అనుమకొండ వెలివాడలో నడుగుపెట్టెదరు. ఆ 'నరాటవి'లో తామొక్కరై బస్తీవింతలలో మునిఁగి తేలుదుమను తలంపే వారిని పొంగిపోవునట్లు చేయుచుండెను. బస్తీ సమీపించుకొలఁది పల్లెటిదృశ్యములమీఁది మక్కువ తెర మఱుఁగునఁ బడుచుండెను.

ఇంతలో నన్నిశకటములు నొక్కసారిగ ఆగిపోయెను. పొగరుమోతు వృషభముల నిలుపుటకు వెనుకబండ్లవారికి కష్టమయ్యెను. బండ్లెందుల కాగినవి? అదియును హఠాత్తుగా! రాత్రి యైననుగాదు. ఏదొంగలో తోడుబోతులో అడ్డగించిరనుకొనుటకు! బండ్లవారందఱును దిగి ముందుబండియొద్ద గుమిగూడిరి. వెనుకవా రేమి టేమిటని ముందువారి నడుగుచు త్రోసికొని పోవుచుండిరి.

బండిచక్రము నేలలోనికి క్రుంగిపోయినది. ఎడ్లుగుంజలేక సుడివడినవి. పూటిబండి యేటవాలుగ వంగుటచే విఱిగిపోవు ననిపించుచుండెను. బండివాఁ డెడ్లతోకలు విఱిచి యదలించెను. పాపము! వృషభముల దోసములేదు. అవి ప్రేగులు తెగునట్లు లాగుచునేయుండెను. కాని బండి కదలలేదు. బండిమీఁది బరువు తగ్గింపనిది లాభము లేదనిపించెను. బండి విఱుగకుండుటకుగూడ నదియవసరమే. గబగబ కొన్నిబస్తాలను

క్రిందికి దింపిరి. మరల బండివాఁడు వృషభముల నదలించెను. అవి శక్తికొలఁది ప్రయత్నించెను. కాని లాభములేకపోయెను. బండివాండ్రందఱును తమ కఠినబాహువులను ప్రయోగించిరి. కాని చక్రము రవ్వంతయు కదలలేదు.

ప్రొద్దెక్కి వచ్చుచుండెను. బాటసారుల రాకపోకలు హెచ్చెను. వచ్చినవారందఱి కిదియొక గొప్పవింతగ నుండెను. పలకొక యుపాయముఁజెప్పిరి. ఒక్కయుపాయమును వదలక కృషిసలుపఁబడెను. కాని యొకటియు ఫలింపలేదు. దారిని పోవుచున్న యొకరిద్దఱు సైనికాధికారులు "ఛీ! పట్టిదద్దమ్మలు బండిచక్రము దిగఁబడిన నెత్తలేరా ?" అని గేలిచేసిరి. అంగీచేతు లెగలాగి చేయిచేసికొనిరి. కాని పరమేశ్వరునివిల్లు నెత్తబోయి తలవంచుకొనిన సీతాస్వయంవర క్షత్రియులఁ దలఁపించిరి.

౨

సుఖనిద్రనుండి కన్నులు తెఱచిన అనుమకొండ పౌరుల కీవార్త చిత్రవిచిత్ర కథానకములతో చేరెను. చేతులలోని శృంగారపు కట్టలతోనే అమ్మలక్క లీవార్తను విమర్శించు చుండిరి. పలుదోముపుల్లలతో నరుగులపై నధిష్ఠించిన పౌరు లీవార్తనే చర్చించుచుండిరి. యువకు లప్పటికప్పుడే బండి దిగ బడినచోటికిబయలుదేఱిరి. పెద్దలు జట్లు జట్లుగాగూడి యా వింత చూడఁబోవుచుండిరి. అందఱిముఖములలోను ప్రశ్న చిహ్నములే, ఆశ్చర్యార్థకములే! బండిదిగఁబడిన ప్రదేశమున నిసుక వేసినను రాలని జనముచేరిరి. అనుమకొండ వేలాతిక్రమణ

మోనర్చిన మహాసముద్రమయ్యెను. అచ్చట నంతయు నొక తిరునాళ్ళవలె నుండెను.

సూర్యుఁడు కరకర యెక్కివచ్చుచుండెను. క్రింద కాళ్లును, పైని నెత్తియు మాఁడుచున్నను జనము లక్ష్యపెట్టుట లేదు. ఆఁకలిదప్పుల నసలేమఱచిరి. బండి యెంతమంది ప్రయత్నించినను కదలదు. పుఱ్ఱెకొకబుద్ధి, నాలుకకొకమాట. దయ్యములు, దేవరలు ప్రజల యూహాపోహాలలోఁ దిరిగిపోవు చుండిరి.

దాసదాసీజనుల ముఖమున నీ యపూర్వవార్త రాచ నగరుల వ్యాపించెను. శ్రీమన్మహామండలేశ్వర ప్రోలరాజేంద్రుఁడు వందిమాగధుల స్తుతిపాఠములతో మేలుకని ప్రాతరనుష్ఠేయములు ముగించుకొని విశ్రమించు సమయమున బేతన దండనాథానుగతుఁడగు గంగాధరామాత్యుఁడు హజారమున నడుగిడెను. రాజదర్శన మైనదో లేదో, అప్పుడే వేగులవార్త యందెను. అద్భుతమును, అపూర్వమును నగునీవార్తకు వారి బుద్ధి పరిపరివిధములఁ బోయెను. వెంటనే పండితాఖండలులకు, శాకునికులకు కబురు వోయెను. వారందఱును ఱెక్కలుకట్టుకొని వ్రాలి చేతులుకట్టుకొని నిలిచిరి. ప్రోలరాజేంద్రుఁడు వారలను వినయవినతుఁడై యుచితాసనము లొసంగి యావింతవార్తను ప్రస్తావించెను. వారు నదేయాలోచనతో నటకు వచ్చియుండిరి. కాని వారి కిదమిత్థమని యేమియు తేలలేదు. జ్యోతిషికులు మాత్ర మీ సమయమునుబట్టి రాజ్యమున కభ్యుదయకరమైన మార్పురాఁగల సూచన కలదని విన్నవించిరి. కాని అంత మాత్రముతో నేమి తేలినట్లు?

ప్రోలరాజు ఆవింతజరిగిన ప్రదేశమును దర్శింపనెంచెను. ఇంగితజ్ఞులగు మంత్రి దండనాథులు వెంటనే సన్నాహము సలిపిరి. రాజేంద్రుఁడు పసిడి పల్లకీలో బయలుదేఱెను. మును ముందు చోపుదారులు, భటవర్గము నడచెను. ఇరువంకల పురోహితాది పండితవర్గము పల్లకీలలో బయలుదేఱెను. దండనాథుఁడు కతిపయపరివారముతోను, గుఱ్ఱములు మొదలగు పరికరములతోను ముందే వెడలిపోయెను. మంత్రి సామంతుల పల్లకు లంతఃపురకాంతల మేనాల కించుక దూర మున నుండెను. వెనుక దాసదాసీజను లసంఖ్యాకులుండిరి. పట్ట ణముపట్టణమే కదలిపోవుచున్నట్లుండెను.

## 3

మఱికొంత తడవునకు బండి దిగఁబడిన ప్రదేశమొక మహానగరమువలెనుండెను. రాజశిబిరములు బంగరుజలపోసనపు పనితనముతో మిలమిల లాడుచుండెను. ఆయుక్తకులకు, అధికారులకు శిబిరములు యథోచితముగ నేర్పడెను. వేత్ర హస్తులు బండిచుట్టును మూగిన ప్రజానీకమును ప్రక్కల కొత్తు చుండిరి. వందిమాగధులు శ్రీమన్మహామండలేశ్వర ప్రోల భూపాలుని యాగమనము దెలుపుచు హెచ్చరిక చేయుచుండిరి. ఇంక కొలఁదిసేపటిలో మంత్రి సామంతపురోహితాదులు బలసి కొలువ ప్రోలరాజేంద్రుఁ డచ్చటికి విజయముచేసెను.

దండనాథుఁడు బండివానిని రాజేంద్రు నెదుట నిలిపెను. వాఁడు భయభక్తులతో వంగి వంగి నమస్కరించుచు జరిగిన

సంగతిని విశదపఱచెను. ప్రోలరాజును, పరివారము సద్భుతా శ్చర్యముల మునిఁగిపోయిరి. ప్రోలరాజు మంత్రి పురోహితులతో కర్తవ్య నిశ్చయమునకై సంప్రదించుచుండెను. ఇంతలో దండనాథుఁడు తన చేతిలోని పట్టాకత్తితో చక్రమునలువైపుల కొంత మంటిని తొలఁగించెను. వింతలోవింత! అతనికన్నులనే అతఁడు నమ్మలేకపోయెను! ఒక్క కేకవైచెను. అందఱి కన్నులు నటుతిరిగెను. ఎవరును తెరచిన నోరు మూయలేదు! ఏమి యా వింత? బండి యినుపపట్టా బంగారముగా మాఱి యుండెను.

పండితు లొక్క గంతువైచిరి. ఆ! ఇప్పుడు బోధపడిన దనిరి. జ్యోతిష్కులు "మేముచెప్పలేదా, రాజ్యమునకు నవాభ్యుదయము గలుగునని" యని ప్రగల్భములాడిరి. అచ్చట పరుసవేది కలదని నిర్ణయమయ్యెను.

రాజానుమతమున చుట్టును కొంత త్రవ్వఁబడెను. మధ్యాహ్న భానుని కాంతిని దిరస్కరించు నవనవోన్మేష దీధితులతో నొక సువర్ణలింగము వెలువడెను. చూపఱ యానందాద్భుతములకు మేరలేదు. వీరభటుల యచంచల దీక్షతో బండిచక్ర మూడిపడెను. బండివారికి ప్రాణములు లేచివచ్చెను.

పురోహితుఁడు శాంత్యనువాకములు చదివెను. ఆవశ్యక వస్తుసముదాయము కనుసన్నలలో వచ్చిపడెను. నమకచమక పూర్వకముగా యథావిధి రుద్రాభిషేకము పంచామృతములతో జరిగెను. ప్రోలరాజేంద్రుఁడు మంత్రి

పురోహిత విద్వాంసులతో మంతనములు సలిపెను. తుద కాలింగమును పెకలించి రాజధానీనగరమున బ్రతిష్ఠించుటకు నిశ్చయింపఁబడెను.

వెంటనే కడు జాగరూకతతో ఆ పరుసవేదిలింగము చుట్టును త్రవ్వించిరి. మహాబ్రాహ్మణులు శివలింగము నెత్త బోయిరి. కాని కదలలేదు. కోరమీసాల భటులు నవ్వుకొనిరి. వారివంతును వచ్చెను. ముచ్చెమటలు పోసెనేగాని లింగము కదలలేదు. చేయునదిలేక వ్రేలమొగములతో వెనుకకువచ్చిరి. ఇంక చేయఁదగిన దేమి?

ప్రోలరాజు కలవరపడెను. మంత్రి దండనాథులు వెఱఁగు పడిరి. పండితు లాలోచనా నిమగ్నులైరి. ఏమి చేయుటకును తోచలేదు.

## ४

ఇంతలో నొక భటుఁడు రాజసమ్ముఖమునకువచ్చి వంగి నమస్కరించెను. "ప్రభూ! రామారణ్య మునీంద్రులఁట. కొందఱు శిష్యులతో వచ్చియున్నారు. దేవరదర్శనము నపే క్షించుచున్నారు" అని వినయముతో మనవిచేసెను. రాజు ముఖమున నద్భుతానందములుకందళించెను. "ఏమియదృష్టము! ఎట్టి శివలీలా విలాసము! ఈ చిక్కుసమస్యను పరిష్కరించుటకు శ్రీవారిదర్శనము చేయు కోరిక యిప్పుడే నా బుద్ధిలో మెఱసి నది. అడబోయిన తీర్థమెదురైనది. మన మెదురేగి శ్రీవారిని తోడితెత్త" మని ప్రోలమండలేశ్వరుఁడు నుడివెను.

పురోహితామాత్య పురస్సరముగా ప్రోలరాజు శ్రీ రామారణ్యాయోగీంద్రుని సన్నిధి కరిగి పాదాభివందన మాచరించెను. దివ్యతేజోనిధియైన యోగీంద్రుఁడు వేదమంత్ర పూర్వకముగా 'శివసంకల్పోభవ! మహాంధ్ర సామ్రాజ్యస్థాపనాచార్యోభవ!' యని దీవించెను. "తమ యాశీస్సు లమోఘములు; మాకు సదా శిరోధార్యములు. ఇప్పుడే తమ దర్శనమునకై సంకల్పించితిని. భక్తజన కల్పద్రుమమగు జంగమలింగ స్వరూపులగు తమ దర్శనమైనది. సకలవాంఛితములు తీఱినవి" యని ప్రోలరాజు వినయ వినమితాంగుఁడై పలికెను.

"రాజేంద్రా! నీ యదృష్టము ఫలించినది. సత్సంకల్పసిద్ధి యార్యధర్మచోదితము. నీవంటి శివాయత్త చిత్తునిచేత పరమశివుఁడు త్రిలింగ మహాసామ్రాజ్యమున కంకురారోపణ మొనర్పఁ జేయుచున్నాఁడు. తెల్లవాఱుజామున మాకొక స్వప్నము వచ్చినది. అందు పరమశివుఁడు సాక్షాత్కరించి 'తెల్లవాఱుసరి కనుమకొండ కనతిదూరమున నేను పరుసవేది లింగస్వరూపమున వెలువడఁ బోవుచున్నాను. అది జయస్థానము. ఆ ప్రదేశమున తెలుఁగు రాజధాని వెలయఁదగును. అచట వెలసిన తెలుఁగు రాజ్యలక్ష్మి మూడు శతాబ్దముల పర్యంత మవిచ్ఛిన్న భోగభాగ్యములతో తులఁదూఁగఁ గలదు. ప్రోలరాజే యీ తెలుఁగు రాజ్యమును స్థాపించుట కర్హుఁడు. నీవాతనిచే నీ శుభారంభము జరిపింపవలయు' నని యాజ్ఞాపించెను. అందులకే మాయీరాక" యని శ్రీ రామారణ్యమునిచంద్రుఁడు చిఱునవ్వు వెన్నెలలు వెల్లివిరియ వాక్రుచ్చెను.

"అంతయు పరమశివకారుణ్యము! తమ శ్రీ శివాజ్ఞ శిరోధార్యము. దయచేయుఁడు పరుసవేదిశివలింగ దర్శన మహోత్సవ మనుభవించి కర్తవ్యము నడిపింప ననుమతింపుఁ" డని ప్రోలరాజు పలికెను.

ప్రోలరాజు స్వయముగ దారిచూప శిష్య పరివృతుఁడై రామారణ్యమునీంద్రుఁడు పరుసవేదిలింగమును సమీపించి సాష్టాంగవందన మాచరించెను. రాజు రామారణ్య మునీంద్రుని ముఖకమలమును భ్రమరాయమాణుఁడై చూచుచుండెను. యోగీంద్రుఁ డొక్కింతతడవు ధ్యానమగ్నుఁడై యుండెను. పిమ్మట నమృతవర్ష మొలయించుచు నిట్లుపన్యసించెను. "ఈ పరుసవేది లింగమును స్థలాంతరమునకు తరలించుట యసంభవము. ఇచ్చటనే యాలయమును నిర్మింపఁ జేయవలయునని శ్రీ శివాజ్ఞ. ఈ యాలయమును కేంద్రముగాచేసి యిచ్చట నొక కోట నిర్మింపవలయును. ప్రోలరాజా! ఇదిగో! విద్యాధర చక్రము. ఈ చక్రము నిటఁ బ్రతిష్ఠింపుము. వెంటనే ఆలయ నిర్మాణమునకుఁ గడంగుము. రాజధానీ నగరమునకు మా బుద్ధికిఁదోఁచిన రేఖాచిత్రమిది. మాకంటె నీ విషయమున మీకు, మీమంత్రులకు ననుభవమెక్కువ. చక్కగా చూచికొని నగరనిర్మాణమునకు ప్రారంభింపుము. నీవు స్థాపించిన యీ త్రిలింగమహాసామ్రాజ్యము మున్నూరు సంవత్సరములు మాఱులేని ప్రతిభతో వెలయఁగలదు. విచ్ఛిన్నాంధ్రశక్తులు సమీకరింపఁబడును. శాతవాహనుల తరువాత నిట్టి త్రిలింగ మహాసామ్రాజ్యము నెఱపిన కీర్తి ప్రతిష్ఠలు మీ కాకతీయులకు దక్కఁగలవు."

"అద్భుతముగా నున్నది మీ నగర నిర్మాణచిత్రము. యోగ పరినిష్ఠితులగు తమ యూహ కందని విషయములు గలవా! జయము శ్రీ రామారణ్యమునీంద్రులకు – ఆంధ్ర మహాసామ్రాజ్యాంకురారోపణ దీక్షా కంకణులకు!" అని మంత్రి సత్తముఁడు పలికెను.

జనులందఱు నేకకంఠముతో "రామారణ్యమునీంద్రులకు జయము! ప్రోలసార్వభౌమునకు జయము!" అని జయజయ ధ్వానములు గావించిరి.

౫

ఇంకఁ జెప్పదగిన దేమున్నది? 'పరుసవేది లింగమునకు దేవాలయము వెలసెను. సాంచీస్తూపద్వారములకు జీవకళ ప్రతిష్ఠించిన చేతులు–అమరావతి, నాగార్జున కొండలయందలి స్తూపములలో సృష్టిచాతుర్యము నెఱపి పితామహునకు 'పుత్రాదిచ్ఛేత్పరాజయం' అన్నట్లు మహానందముఁ గొలిపిన చేతులు – శిలలను దొలచెను, మలచెను. ఆ చిత్తారితన మపురూపము; ఆద్వారములస్వబగువర్ణించుటకు వేయినాలుకలు చాలవు. శిలలకు ప్రాణముపోసిన శిల్పులు ప్రోలరాజు సంకల్ప స్వరూపులు; పరమమాహేశ్వరులు స్వయంభూదేవాలయము సిద్ధమయ్యెను. కాని దుర్గనిర్మాణమును కనులార జూచుకొను భాగ్యము ప్రోలరాజునకు లేదు.



వెయ్యి స్తంభాల గుడి.

# ౨. విధిలిఖితము

౧

"హత్యహత్య! ఘోరహత్య!!"
"రాజధానికడనే? – ఎంతసాహసము!"
"స్వయంభూస్వామి యాలయముననే – ఎంత తెగింపు!"
"చీఁకటి చాటుకూడ కాదే – ఎంత ఘోరము!"
"దుర్గపాలకుఁ డెందరిగె – రక్షకభటు లేమైరి?"
"ఓరుగంటిప్రజ లిట్టిఘోర మెన్నఁ డెఱుఁగరే!"
"ఇది శత్రురాజుల కుట్ర కాదుగదా!"
"ఇంతకు నేదో యరిష్టము మూడనున్నది."
"హంతకుఁడైన పట్టువడెనో లేదో!"

అని యేమేమో ప్రలాపములు విననయ్యెను. అప్పటికి బారెఁడు ప్రొద్దెక్కెనో లేదో! ఏకశిలానగర మట్టుడికిన ట్లుడికి పోవుచుండెను. పౌరు లెక్కడిపను లక్కడ కట్టిపెట్టి దౌడు తీయుచుండిరి. ఒకరికన్న నొకరు ముందడుగు వేయసాగిరి. ఆ త్రొక్కిడిలో పిన్నలు, పాపలు నలఁగిపోవుటకూడ వారికి పట్టదయ్యెను. మూలనున్న ముదుసలికూడ కఱ్ఱ పొడుచుకొనుచు నడక సాగించెను. అన్నివీథులనుండి జనులు నేల యీనినట్లు వచ్చిపడుచుండిరి. ఆ ప్రవాహ మొక్క క్షణములో స్వయంభూస్వామియాలయమును జుట్టివైచెను.

మంత్రులు, దండనాథులు, రాజోద్యోగులు నప్పటికే వచ్చియుండిరి. వారందఱు మంటపమునొద్ద వేఁడినిట్టూర్పులతో నిలువఁబడిరి. ఒక్కరి మొగమునను కత్తివాటుకైన నెత్తురుచుక్క లేకుండెను. రక్షకభటులు మంటపముమీఁదికి ప్రజాప్రవాహము పొంగిరాకుండ నదుపుచేయుచుండిరి. ప్రజల కళ్ళఁబడిన దృశ్యమెద్ది? కాకతి ప్రోలరాజు నెత్తుటేటులఁ దొప్పదోఁగుచుండెను. ఆయన వక్షస్థలమున నొక బాకు పిడివఱకు గ్రుచ్చఁబడి యుండెను. హంతకుడు బిత్తరి చూపులతో విభ్రాంతుఁడై నిలువఁబడి యుండెను.

హత్యచేయఁబడినవ్యక్తి తమ మహారాజని బోధపడెను. పిడుగువంటి యీవార్త ప్రజలను కలగుండు పడఁజేసెను. వారి యుద్రేక మాకసమంటెను.

"చంపుఁడు, పొడువుఁడు, హంతకునిపట్టి పల్లార్పుఁడు."

"గ్రుడ్లప్పగించి చూచెదరేమి? ఏనుఁగులతోఁ ద్రొక్కింపుఁడు."

"దుర్మార్గునితలనఱికి కోటకొమ్మకువ్రేలాడఁగట్టుఁడు."

"మన కన్నతండ్రి – మన ప్రోలరాజును పొట్టఁబెట్టుకొన్న నికృష్టుఁడింకను జీవములతో మిగిలియుండుటా?"

"ఆంధ్ర సామ్రాజ్య సంస్థాపకుఁడే! రామారణ్య మునీంద్రుల ప్రియశిష్యుఁడే! ఎంతలో నెట్టి పాటు సంభవించినది!"

"ఇన్నాళ్ళు కడుపులోచల్ల కదలకుండ గడపితిమే. ముం దెట్టిపాట్లు రానున్నవో కదా!"

“తెలుఁగు వెలుఁగున కీశ్వరునకుఁగూడ కన్నుకుట్టెనా యేమి? ఎంతటి జాతిగుండె!”

ప్రజాసముద్ర మేకకంఠముగ ఘూర్ణిల్లఁ జొచ్చెను. దాని నరికట్టుట రక్షకభటులకుఁ దలకుమించిన పని యయ్యెను. చెలియలికట్టకు గండ్లుపడెను. ఎదురొడ్డి నిలువరింపఁగలవా రెవ్వరు! హంతకుఁ డొక్క త్రుటిలో ఖండ ఖండములుగ తెగిపడవలసినదే!

అంతలో ప్రోలరాజు కనుదమ్ములు విచ్చుకొనెను. అవి పూర్వమువలె కరుణామృతమును జిలుకు చుండెను. ప్రాణ వాయువులింకను ఆతని వీడిపోలేదు. ఆతఁడు చేయెత్తఁగనే యెక్కడివారక్కడ కొయ్యబొమ్మలవలె నిలిచిపోయిరి. ప్రోల రాజునోట మేఘగర్జనములవలె నీక్రింది మాటలు వెలువడెను.

“ఆగుఁడు. హంతకుఁడెవఁడో కాఁడు – నాకుమారుఁడే! ఆంధ్రసామ్రాజ్యమునకు భావిచక్రవర్తి!!”

౨

ప్రోలరాజునకు లేక లేక తేజశ్శాలియగు పుత్త్రుఁడు జన్మించెను. పుత్త్రోత్సవపు వేడుకలలో గొప్ప దర్బారు జరిగెను. గొప్ప గొప్ప జ్యోతిషికు లాసభకు విచ్చేసిరి. రాజు వారితో నేకాంతమున కుమారుని జాతకమును గుఱించి ప్రశ్నచేసెను. వారు నొక్కింత తడవేమేమో లెక్కలువేసిరి. తాటియాకుల

గ్రంథములను దిరుగవైచిరి. తుద కొకరి మొగ మొకరు చూచుకొని పెదవి విఱిచి మిన్నకుండిరి. ప్రోలరాజు గ్రుచ్చి గ్రుచ్చి యడుగుటచే వారు తప్పుకొనఁజాలక "ప్రభూ! నీ కుమారుఁడు దీర్ఘాయుష్మంతుఁడగును. తండ్రిని మించిన కొడుకు కనిపించుకొనును. కాని తమ కీతని చేతిలో మృత్యువు వ్రాసిపెట్టి యున్నది" అని తెలిపిరి. ప్రోలరా జెట్టి విషాదమును దెలియ రానీక వారిని సన్మానించి పంపివైచెను.

ప్రోలరాజు దుఃఖముతో కుంగిపోయెను. ఆతఁడాప్తులగు గంగాధరాది మంత్రులతో నాలోచించెను. ఆంధ్రసామ్రాజ్యము స్థాపితమైనదే కాని స్థిరపడి యుండలేదు. ఇంటను బయటను శత్రువులు పొంచియుండిరి. అట్టి సమయమున ప్రోలరాజునకుఁ గీడు మూఁడినచో తెలుఁగువారి యాస లడియాసలగును. అందుచే శిశువును జంపివైచుటయే కర్తవ్యమని వారుబోధించిరి. కాని చేసేత నెవ్వ రాఘోరకృత్య మొనర్పఁ గలరు? కడకు బాలు నరణ్యములో వదలి వన్యమృగముల పాలు గావించుటకు నిర్ణయింపఁబడెను. కాని ప్రోలరాజు కడుపుతీపిని చంపుకొనలేక పోయెను. అతఁ డొకనాఁటి యర్ధరాత్రమున శిశువును స్వయంభూస్వామి గర్భాలయమునఁ బరుండబెట్టి వచ్చెను.

మఱునాఁటి యుదయమున నాలయ పరిచారకులు కెవ్వు కెవ్వుమనియేడ్చు నా నెత్తుటి గ్రుడ్డునుచూచి పూజారుల కెఱుకపఱిచిరి. పెద్దపూజారి రుద్రజియ్య యను నతఁడు సంతతి లేనివాఁడు. అతఁ డా బాలకుని శివప్రసాదముగ గ్రహించి భార్య కప్పగించెను. ప్రోలరా జేమియు నెఱుఁగని వానివలెఁ

బూజారిని పొగడి "ఎవఁడైన నేమి? పసిపాపఁడు. వానిని పెంచి పెద్దవానినిజేసి విద్యాబుద్ధుల చెప్పించి పిదప సంస్థానమున కప్పగింపుఁడు. అప్పుడాతఁడు స్వతంత్రముగ జీవింపఁగలఁడు. మీకు పుణ్యము పురుషార్థము రెండును సమకూడును. బాలుని పోషణమున కగు వ్యయమంతయు ప్రభుత్వమే భరింపఁగలదు" అని సబహుమానముగ వీడ్కొలిపెను.

రుద్రజియ్య శిశువునకు రుద్రదేవుఁడని నామకరణ మొనర్చి యల్లారుముద్దుగఁ బెంచుకొనుచుండెను. కన్న మోహముకన్న పెంచిన మోహ మెక్కుడు కదా! బాలకుఁడును నాఁటఁ బెరుగునది పూఁట బెరుగుచు ముద్దు మురిపెములతో పూజారి దంపతుల నలరించుచుండెను. 'సార్వభౌములింట జనింపఁ దగిన వాఁ' డని జూపఱు లెల్లరు వింతఁ జెందుచుండిరి. రుద్రదేవుఁడు యుక్తవయస్కుఁడై వేదశాస్త్రాదికములఁ బాండిత్యము గడించెను. క్షత్రియోచితములైన శస్త్రాస్త్ర విద్యలను సాధించెను. నూనూఁగు మీసాల నూత్న యౌవనముతో సానబట్టిన జాతిరత్నమువలె నాతఁడు వెల్గొందుచుండెను.

ప్రోలరాజునకు స్వయంభూస్వామి యనుగ్రహమున మఱొక పుత్రుఁడు జనియించెను. రాజు వానికి మహాదేవ రాయలని నామకరణము గావించి యల్లారుముద్దుగఁ బెంచుకొనుచుండెను. ఆ బాలుఁడు దినమొక చాయగా నెదుగుచు తల్లిదండ్రులకు నేత్రపర్వము గావించుచుండెను. ఐనను ప్రోలరాజు తన జ్యేష్ఠసుతుని మాట మఱవలేదు. అప్పుడప్పుడాతని హృదయమున నది కెలకవేయుచునే యుండెను.

అనుదినము వేఁకువనే లేచి స్వయంభూదేవు నర్చించి మఱలివచ్చుట ప్రోలరాజు నిత్య కృత్యములలో నొకటి. నాఁడు నట్లే చనుదెంచెను. పరివారము మామూలు ప్రకారము ప్రాకారము వెలుపల నిలిచిపోయెను. ప్రోలరా జొంటిమై యిలోని కరిగి శివార్చనము ముగించెను. మగిడి వచ్చునప్పుడు మంటపమున నొక యువకుఁడు నిద్రించు చుండు టాతనికిఁ బొడకట్టెను. రాజు కుతూహలముతో వానిని సమీపించెను. ఆ వ్యక్తి యెవ్వరో కాదు. రూపొందిన శౌర్యమో యన రుద్రదేవుఁ డచ్చోట శయనించియుండెను.

ప్రోలరా జింతకుమున్ను రుద్రదేవు నొంటిగాఁ గలిసి యుండలేదు. అతనిలోని పితృప్రేమ పెల్లుబ్బి కట్టలు తెగి పొంగులువారెను. కన్నకొడుకు నొక్కమాఱు ఆలింగనము చేసికొనవలెనని యాతనికి బుద్ధిపుట్టెను. ఎంతయణచుకొన్నను చిత్తవికార మాఁగినది కాదు. ఆతఁడు తత్తరముతో నల్దెసలఁ గలయఁజూచెను. కనుచూపుమేరలో నెవ్వరును లేరు. ఇంతకన్న నవకాశము లభించుట దుర్లభము. ప్రోలరాజు కాళ్లుతడబడు చున్నను లెక్కసేయక కొడుకును కౌఁగిలించుకొని శిరము మూర్కొనెను.

రుద్రదేవుఁడు కలఁతనిద్దురలో నుండెను. వాఁడు మిక్కిలి యేదో దుస్స్వప్నము గనుచుండెను. అట్టిస్థితిలో ప్రోలరా జాతని పరిష్వంగము కోరెను. శత్రువులెవ్వరో తనపైఁ గవిసిరని రుద్రదేవుఁ డూహించెను. త్రుళ్ళిపడి లేచెను. మైకముతోనే మొలలోనిబాకును బెఱికి ప్రోలరాజు వక్షమున నాటించెను. ఈ

యలజడి విని పరివారము లోనఁ బ్రవేశించెను. కొందఱయ్యోడఁ గాఁపుండిరి. కొందఱు పట్టణములోనికి దౌడుతీసిరి. దవానలము వలె నీవార్త వ్యాపించుట కెంతో కాలము పట్టలేదు.

## 3

"ఈ రాజద్రోహి - ఈ పితృఘాతకుఁడు ఆంధ్ర సామ్రాజ్యమునకు భావిచక్రవర్తియా! అసంభవము" అని ప్రజలు విస్తుపోయిరి. వారి హృదయములలో నేదో పూర్వగాథ లీలగా మెఱయఁ జొచ్చెను; కాని వారు నమ్మఁజాలకుండిరి. ఐనను, ఎవ్వరును నోరుమెదప సాహసింపరైరి.

ప్రోలరాజు ప్రజలహృదయములలోఁ బర్వులిడుచున్న భావములను పసికట్టెను. రక్తక్షయమగుటచే నాతఁడప్పటికే కడునీరసించి యుండెను. ఊపిరి బరువుగా వచ్చుచుండెను. శక్తినంతయు నొక్కమాఱు కూడఁదీసికొని యతఁడిట్లు వాక్రుచ్చెను.

"పౌరులారా! నా ప్రజలకడ ఈ యవసానదశలో నసంగతవిషయము చెప్పుదునా? ఈ సంగతి రెండవకంటివానికి దెలియకుండ నిన్నాళ్ళు కప్పిపుచ్చితిని. ఈతఁడు నిక్కముగ నాకుమారుఁడే".

రుద్రదేవుని జన్మవృత్తాంతమంతయు రాజు పూసగ్రుచ్చినట్లు నుడివెను. జ్యోతిషికుల సిద్ధాంతము, మంత్రుల నిర్ణయము, వన్యమృగములవాతఁ బడవేయుట కిచ్చగింపక శిశువును శివాలయమునఁ జేర్చుట, రుద్రజియ్య పెంపకము మున్నగు విషయ

ములు ప్రజలకుఁ దెలుపఁబడెను. శివార్చన మొనర్పవచ్చిన రాజు రుద్రదేవుఁ డొంటిమెయి నిద్రించుచుండుటనుగాంచుట, పుత్రప్రేమ పట్టఁజాలక యాతనిఁ గౌఁగిలించుకొనుట పౌరులు గ్రహించిరి.

“రుద్రదేవుఁ డీపని తెలిసిచేసెనా? లేదు. శత్రువెవ్వఁడో పైఁబడెనని కలఁతనిద్దురలో నీ ఘాతయొనర్చెను. విధి మొదటనే మన లలాటపట్టికను లిఖించిపెట్టును. ఆ వ్రాలు నాతఁడే మార్పుసేయలేఁడు. మానవులు తప్పించుకొనఁ జూచుట నగుబాటుకాదా! నేఁటితో నాకాయువుసరి. పితృహంతయని వీనిని దండింపఁజూడకుఁడు. ఈశ్వరాజ్ఞ యిట్లున్నది. నాతుదియాజ్ఞ – తుదికోర్కె – పాలింపుఁడు. నా తండ్రిని, నా రుద్రదేవుని ఓరుగంటి రత్నపీఠిపై నభిషేకింపుఁడు. ఆంధ్ర సామ్రాజ్యభారము వహించుట కీతఁడెల్లభంగుల నర్హుఁడు” అని ప్రోలరాజు ప్రజల నర్థించెను.

రుద్రదేవుఁడు తన పుట్టువును గుఱించి యింత కథయున్నదని యెఱుఁగఁడు. తంబళదంపతులే తన జననీ జనకులని భావించి యుండెను. రుద్రజియ్యయైన నతఁడు శివలింగము నెదుట దొరకిన కుఱ్ఱఁడని చెప్పనవసరము కలిగియుండలేదు. తాను నిరపరాధిని హత్య చేసితినని దోఁచినప్పుడే రుద్రదేవుని ప్రాణములు పైని బోయెను. ఆ వ్యక్తి యాంధ్రసార్వభౌముఁడని విన్నప్పుడాతఁడు నిజముగా కొయ్యబాఱి పోయెను. సార్వభౌముఁడు తన తండ్రియే యని తెలిసినప్పుడాతని స్థితి యెట్లుండెనని చెప్పఁగలము?

"రాజద్రోహినే కాక పితృహంతను కూడనా? శిక్ష సామ్రాజ్య ప్రదానమా!" అని రుద్రదేవుఁడు తండ్రిపైఁబడి బిట్టు విలపింపఁజొచ్చెను. ప్రోలరాజాతని నెమ్మేను నిమురుచు "నాయనా! నివురు గప్పిన నిప్పవలె నిన్నాళ్ళు సామాన్యులింటఁ బెరిఁగితివి. స్వార్థమునకై నిన్ను రాచటికమునకు వెలియొనర్చితిని. తెలియక చేసిన తప్పునీది – తెలిసి చేసిన తప్పు నాది. అంతయు నీశ్వరేచ్ఛ! త్రిలింగ సామ్రాజ్యమును స్థాపించుటకై నా జీవితమును వెచ్చించితిని. దాని నిప్పుడు నీచేతులలో పెట్టి పోవుచున్నాను. నీశక్తిచే నది స్థిరపడినప్పుడే తండ్రి ఋణమును దీర్చుకొన్నవాఁడ వగుదువు. అప్పుడే నాయాత్మయు తృప్తిఁ జెందగలదు. తమ్ముఁడు మహాదేవ రాయలు..." అని యేమో గొణుగుచునే కన్నులు తేలవైచెను.

ప్రోలరాజు ప్రాణము వాయుపథమున నెగిరిపోయెను. ప్రజలుహాహారవములొనర్చిరి. ఆత్మబంధువులతో వియోగము గలిగినప్పుడైన వారట్లువిలపించి యుండరు. తెనుఁగు మాగాణ మొక్కపెట్టున దుఃఖసముద్రమున మునిఁగిపోయెను.

౪

రుద్రదేవుఁ డొక్క సుముహూర్తమున నాంధ్ర సామ్రాజ్యమునకు పట్టాభిషిక్తుఁ డయ్యెను. ఆతఁడు తండ్రి యానతి నక్షరాల పాలించెను. సామంతమండలాధిపుల తిరుగుబాటు లణఁచివేయుటయే గాక సామ్రాజ్యమును నలుముఖములు విస్తరింపఁజేసెను. తగు కట్టుదిట్టములతో రాజ్యము

స్థిరపడునట్లు చేసెను. శాత్రవులాతని నపరరుద్రునిగ భావించి తలలెత్తుటకు సాహసింపరైరి.

రుద్రదేవుఁడు పెక్కు శివాలయములు నిర్మించెను. అనుమకొండలో సహస్రస్తంభమంటపమును నిర్మించెను. పుణ్యక్షేత్రముల నన్నిఁటిని దర్శించి దానధర్మములు చేసెను. కవిపండితుల నాదరించి, స్వయముగ కవియై 'విద్యాభూషణుఁ' డను బిరుదుగాంచెను. పెక్కుతటాకములను నిర్మించి భూమిని సస్యశ్యామల నొనర్చెను. అతని కాలమున సామ్రాజ్యము మహోచ్ఛదశ యనుభవించినదను టతిశయోక్తి కాదు.

ప్రజ లాతఁడు పితృహంత యనుమాట మఱచిపోయిరి. అతని తమ్ముఁడు మహాదేవరాయలుమాత్ర మా మాటనే పట్టుకొని కొన్నాళ్లు ప్రేలాడెను. ఒకప్పుడాతఁడుకుట్రదారులతో చేతులు కలుపుటకుఁగూడ వెనుకాడలేదు. రుద్రదేవుఁ డాతని శత్రువులతోఁ గలియనీయక తనప్రేమపాశముచేఁ గట్టివైచెను. క్రమముగా మహాదేవరాయలు ద్వేషమును వీడి యన్నకు చేదోడువాదోడుగా మెలగఁ జొచ్చెను. రుద్రదేవుని యనంతరము మహాదేవరాయల పుత్రుఁడుగణపతిదేవుఁడు గద్దెనెక్కెను

పితృఘాతుకుఁ డనుమాట రుద్రదేవునియెద నెడనెడ కెలకవేయుచునే యుండెను. అది మాయనిమచ్చ! కాని యాంధ్రసామ్రాజ్య మాతనికాలమున నిలువద్రొక్కుకొనుటతో ప్రోలరాజునాత్మ తృప్తిచెందె నని చెప్పకతప్పదు.

---

# ౩. కవిసన్మానము

## ౧

నాఁడు ఓరుగల్లు రాజవీథులు మిగులసందడిగ నుండెను. ప్రజ లాబాలగోపాలము బాటల కిరుప్రక్కల బారులుకట్టి యుండిరి. మేడలు, మిద్దెలు, గోడలు, గొబ్బెలు ప్రేక్షకులతో క్రిక్కిరిసిపోయెను. స్త్రీలుసైతము పని తీఱికచేసికొని యట గుమిగూడిరి. ఇంత సంచలనము గలిగించిన యా వింత యేమై యుండునో !

అల్లంతన 'ఓంభాయ్, ఓంభాయ్' అను కేకలు విన వచ్చెను. ప్రజలలో కలకలము హెచ్చెను. అందఱి దృష్టు లొక్కుమ్మడి యావంకకుఁ బ్రసరించెను. అందల మొకటి రాజవీథిని సాగివచ్చుచుండెను. అందొక మహానుభావుఁ డాసీనుఁడై యుండెను. అతఁడు రూపొందిన బ్రహ్మదేవునివలె గన్పట్టుచుండెను. ఇంతలంతలగు బ్రహ్మచారులు – ఆతని శిష్యులు కాఁబోలు ! – వెంటవచ్చుచుండిరి. అందు కొందఱు వేదమంత్రము లుచ్చైస్స్వరంబునఁ బఠించుచుండిరి; మఱికొంద ఱేదో శాస్త్రచర్చ గావించుచుండిరి. ఇంకను గొందఱు తమ సందేహముల గురువుగారి నడిగి తీర్చుకొనుచుండిరి. జనులు చిత్రప్రతిమలవలె చేష్టలుదక్కి యా దృశ్యమును దిలకించుచుండిరి.

పల్లకీ క్రమముగా హజారములు దాఁటి రాచనగరు ప్రవేశించెను. కొలువుకూటము దరిసినంత నయ్యది నిలిచి పోయెను. ద్వారికులు లోనికరిగి ఱేనికి నివేదించిరి. ఆ సమయమున కాకతిచక్రవర్తి గణపతిదేవుఁడు నిండుకొలువుదీరి యుండెను. మంత్రులు, సామంతులు, దండనాథులు, పండితులు, కవులు మున్నగువా రుచితాసనము లలంకరించి యుండిరి. పై వార్త చెవినిబడగనే రాజు రత్నసింహాసనమునుండి దిగ్గున లేచి యెదురువచ్చెను. అందలమునందలి వ్యక్తి శిష్యు లందించిన బంగరు పావుకోళ్లు తొడిగెను. కుండలముల రత్నకాంతులు జిగేలు మనిపించుచుండ సభాంగణమున నడుగుపెట్టెను. అగ్నిశిఖవంటి శిఖ, బ్రాహ్మము వెల్లివిరియు చున్న విభూతిరేఖలు, పింజబోసికట్టిన వెల్లపంచె, కాశ్మీరపు దుసేలువ–ఆ మూర్తికి మఱింత వన్నెఁగూర్చెను. ముఖ్యముగ ఆముఖమున తాండవించుచున్నదివ్యతేజస్సు సభ్యుల ముగ్ధులను గావించెను.

ఆతఁడు మందగమనమున చక్రవర్తిని సమీపించి తన దక్షిణహస్తమెత్తి వేదోక్తముగ నాశీర్వదించెను. "గణపతిదేవ సార్వభౌమా! పెన్నాతీరము విక్రమసింహపురము మా కాపురము. మనుమసిద్ధినృపాలుని యాస్థానము మాకు పట్టుఁగొమ్మ. మావాణి భారతామ్నాయమును తెనుఁగున నవతరింపఁ జేసినది. ఉభయ కవిమిత్రుఁడను. 'బుధారాధనవిరాజి తిక్కన సోమయాజి' యని నన్ను వాకొందురు" అని తన్నెఱింగించు కొనెను.

"ఏమేమీ! తిక్కనసోమయాజు లిటకేతెంచినారా! భళిరే! పిచ్చుగుంటుపై భాగీరథి ప్రవహించినది. మా జన్మము తరించినది. మా రాజ్యము పావనమైనది. మిమ్ము మేమేమి యర్చన సేయజాలుదుము! ఏదో చంద్రునకొక నూలుపోగు!" అని తెనుగురాజు అర్ఘ్యపాద్యాదివిధులఁ బూజించి బంగరు గద్దెపై కవీంద్రు నాసీనుంజేసెను. శిష్యులును గురుపాదులఁ బరివేష్టించి కూర్చుండిరి.

అంత కాకతీంద్రుఁడు చేతులు జోడించి "ఊరక రారు మహాత్ములు! భారతకథాశ్రవణమున మేము, మా ప్రజలు తరించెదముగాక!" అని వినయ ముట్టిపడఁ బలికెను. తిక్కనామాత్యుఁడును ముసిముసినవ్వులతో "మీరు రాజులు; మేము కవిరాజులము. మనబాంధవ్య మీనాఁటిదికాదు. లోకకల్యాణమేకదా మా రచనకు లక్ష్యము" అని యుపన్యసించెను.

౨

భారత కాలక్షేపమునకుఁ దగిన యేర్పాట్లు గావింపఁ బడెను. గణపతిదేవుఁడు చందన తాంబూలాదులతోఁ గవీంద్రు నర్చించెను. శిష్యులు తాటియాకుల పుస్తకమును వ్యాసపీఠముపై నలంకరించిరి. అంత సోమయాజి,

"శ్రీయన గౌరినాఁబరగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపముదాల్చి..."

అని మంగళాచరణముఁ బాడెను. పిమ్మట శిష్యసత్తముఁడైన మారన గురువులకు బాసటయయ్యెను. అతఁడు రాగతాళ

యుక్తముగ గొంతెత్తి పద్యములఁ బఠింపసాగెను. పలుకు పలుకున నమృతము చిందిపడుచుండెను. తిక్కన భారతార్థ ముల వివరించుచుండెను. ఇట్లు పర్వముతరువాత పర్వముగ నడక సాగిపోవుచుండెను. కవులు, పండితులు, విమర్శకులు తండోపతండములుగ వచ్చి మూఁగుచుండిరి. అనుదినము శ్రోతలసంఖ్య హెచ్చుసాగెను. ఎట్టకేలకు భారతము వినుచుట సమాప్తమయ్యెను.

"ఆహాహా! పదునేనుపర్వములు-ఇరువదివేల పద్యములు ఒక్కచేత ఏకధాటిగ నిర్వహింపఁ బడినవి. ఈయన సాక్షాత్తు కవి బ్రహ్మయే!" అని కొందఱు ముక్కున వ్రేలిడికొనిరి.

"సంస్కృత పదములకు, తెనుఁగుమాటలకు ఎంతచక్కని పొంతన కుదిర్చినాఁడు! 'ఉభయకవిమిత్రుఁ' డను నుడి యీయనకే చెల్లినది" అని మఱికొందఱు తలలూపిరి.

"అబ్బ! తెనుఁగుబాస యెంత తియ్యనిది! ఈ సత్య మీయన రచనకు మున్ను గ్రహింపఁ గలిగితిమా? ఆంధ్రావలి మోద మీయనకే దక్కినది" అని వేఱొకకొందఱు పొగడిరి.

"ఒక్క గంటమున వందలకొలఁది ఖడ్గములు పుట్టుకొని వచ్చినవే! కావుననే కవియై మహామంత్రి కూడ కాఁగలిగి నాఁడు" అని యింకను గొంద ఱబ్బురము చెందిరి.

ఐన నెంతటి ఘటనకునకైనఁ బ్రతిఘటనము తప్పదు. నాఁడు కాకతీయసామ్రాజ్యమున జైన బౌద్ధ పండితుల మాట చెల్లుబడి యగుచుండెను. వారాడిన దాట, పాడినది పాటగా

నున్నరోజులవి ! వారు తిక్కనపై నీసుచెంది వాదమునకుఁ దలపడిరి. పంచమ వేదమునందలి వైదికధర్మములను వారధిక్షేపించిరి. కాని తిక్కన సామాన్యుఁడా ! వేదధర్మము నుద్ధరింప కంకణము గట్టుకొన్న మహనీయుఁడాతఁడు ! వాదోపవాదములతో నాఱునెలలు జరిగెను. కడకు తిక్కన విజయము సాధించెను. బ్రహ్మరథము పట్టిరి.

గణపతిదేవుని యానందమున కవధిలేదు. అతఁడు సోమయాజి పాదములపై సాష్టాంగపడెను. "విశ్వమంతటికినిఁ జాలినది మీ యీరచన యొక్కటే ! భళి భళీ ! తెనుఁగువారు మీ ఋణమును దీర్పలేరు. ఈ రాజ్యమెల్ల మీయది. నేఁటి సుత అవిచ్ఛిన్నముగఁ బరిపాలింపుఁడు" అని శిరము వంచి నిలిచెను.

ఇసుకవైచిన రాలని సభయెల్ల నిశ్శబ్దమయ్యెను. తిక్కన మాఱుపల్కుటకుఁ గొంత యావేదన చెందినట్లు కన్పట్టెను. అతఁ డెట్టకేలకు ప్రభుని కెంగేలు తనకేల గీలించి యిట్లనెను. "సార్వభౌమా ! నీచేతి కెముక లేదు. ఈ విశ్వమునకు విశ్వమే తలకెత్తినను ఆస తీరునదియా ? నాబోటికి రాజ్యమేల ? నీ చల్లని పాలనము వెయ్యేండ్లు వర్థిల్లుగాక !"

సభ్యులలోఁ బరిపరివిధముల నాలోచనములు రేకెత్తెను. అతని కామితమెట్టిదో యెవ్వరికి నంతుపట్టదయ్యెను. అంతలో తిక్కన యందుకొని "మహారాజా ! నీ చల్లని చూడ్కితో సామంత రాజ్యములు పుట్టువందును. నీకంటె

మెఱుపుతో నదృశ్యములగును. నీ సామంత కోటిలో మా నెల్లూరు ప్రభువు ప్రథమగణ్యుఁడు. కుతంత్రములు పన్ని యతని దాయాదు లక్కన్న బయ్యన్నలనువా రాతని సింహాసనము నాక్రమించినారు. మా రాజ్యలక్ష్మి యశోకవని యందలి సీతను దలఁపించు చున్నది. ఆమెచెఱ వదలింపుఁడు. దీనిని యాచించుటకే నారాక” అని వాక్రుచ్చెను.

“ఆహా! ఈతని మేనెల్ల రాజభక్తియే! ఇతని నాశ్రయించి సరస్వతి నిక్కముగ చరితార్థమైనది” అని ప్రజలు జేజేలుకొట్టిరి. గణపతిదేవునిదృష్టి ప్రధాని, దండనాథులపైఁ బ్రసరించెను. ఆ కనుసన్నలోని యాదేశములెట్టివో వారే గ్రహింపవలయును!

## 3

ప్రభాత మంగళ గీతములతోఁబాటు రణదుందుభులు మ్రోఁగెను. కాకతీయ సైనికులు పురము వెలుపల విశాల ప్రదేశమునకుఁ జేరుకొనిరి. చతురంగబలములు వివిధ శస్త్రాస్త్రములతో సన్నద్ధములయ్యెను. మందుగుండు సామగ్రియు, ఆహారపదార్థములు బండ్లకొలఁది సమకూర్పఁబడెను. ఒక్క రాత్రిలో దండయాత్రకు సర్వసన్నాహములు గావింపఁబడుట మాటలా? మంత్రుల మహిమ యట్టిది! దండనాథుల దక్షత యట్టిది!!

గణపతిదేవుఁడు భద్రగజము నధిరోహించెను. కవి బ్రహ్మయు నాయన సరసన గూర్చుండెను. అంగరక్షకు

లుత్తమాశ్వములపై ప్రభువును బరివేష్టించి యుండిరి. ప్రయాణభేరి మ్రోఁగెను. “లాటచోడ కటక చూఱకారా! మంనియ బెంటకారా! కాకతీయధురంధరా! గణపతిదేవ చక్రవర్తీ! జయము జయము!!” అని వందిమాగధులు బిరుదావళి నాలపించిరి. పుణ్యాంగనలు పూలసేసలు చల్లిరి. వేదండము నడగొండవలె ముందునకు సాగెను. చక్రవర్తి పట్టణవీథులుదాటి సైన్యములను గలిసికొనెను. నిర్ణీతకాలమున జైత్రయాత్ర ప్రారంభమయ్యెను.

గణపతిదేవుని ముఖమున చిఱునవ్వు వెన్నెలలు గాయుచుండెను. సోమయాజి యుత్సాహమునకు మేరలేదు. సైనికులు వీరాలాపములతో నొండొరుల హెచ్చరించుకొనుచుండిరి. అది రణమునకుగాక పెండ్లికిఁ దరలిపోవుటగాఁ గన్పట్టెను.

క్రమముగా నోరుగంటి సైన్యము వెలనాఁడు ప్రాంతములకుఁ జేరుకొనెను. వెలనాటిప్రభు వెదిరిబల మెఱుంగక యుద్ధమునకుఁ దలపడెను. హనుమంతునిముందా కుప్పిగంతులు? గణపతిదేవుఁ డాతనికి బుద్ధిచెప్పి కప్పము లందికొనెను. తొలివిజయముతోడి యుత్సాహముతో కాకతిసైనికులు హుటాహుటి ముందునకు సాగిరి.

ఒకనాఁటి సుప్రభాతమున నోరుగల్లు బలములునెల్లూరు దుర్గమును చుట్టివేసెను. అక్కన్న బయ్యన్నలకు గుండెలలో ఱాయిపడెను. ఇట్లగునని వారు కలలోఁగూడ నూహించి యుండలేదు. మంత్రులకుఁ గర్తవ్యము తోఁచదయ్యెను.

కార్యము మించి వచ్చినది. ఓపినంతవట్టు దుర్గరక్షణము గావించుకొనుటకే వారు నిశ్చయించిరి.

అక్కన్న బయ్యన్నలు స్వబలంబులఁ గూడదీసికొని యుద్ధమునకు గడంగిరి. అప్పటికే శత్రుసైనికులు కోటగోడల కెగఁబ్రాకుచుండిరి. అక్కన్న బయ్యన్నలు తీవ్రముగఁ బ్రతిఘటించిరి. సలసల మరుగుచున్న నూనెలు గ్రుమ్మరించిరి. శస్త్రాస్త్రములతో నొప్పించిరి. కాని యోరుగంటి బలము లపారములు. అవి యుసిళ్లమందలవలె వచ్చిపడుచుండెను. క్రమముగా నవి కోటగోడల నాక్రమింపఁ గలిగెను. అవి యంతతో నాగక దుర్గకవాటములను దెఱచివైచెను.

గణపతిదేవుని సైన్యములు నలుముఖములనుండి కోట లోనికిఁ జొచ్చుకొనివచ్చెను. అక్కన్న బయ్యన్నల యాట కట్టెను. వారి బలము పంచబంగాళమయ్యెను. విధి యెదురు తిరిగినప్పు డెవ్వరుమాత్ర మేమి చేయఁగలరు? వారు మనుమసిద్ధియెడఁ గావించిన ద్రోహము క్షమింపరానిది. అదియే వారిట్టి యిడుముల పాలగుటకు హేతువైనది. అక్కన్న బయ్యన్నలు కాళ్లకు బుద్ధిచెప్పి పరిసరారణ్యములలో దలదాచుకొనిరి.

విక్రమసింహాపురము ప్రజలు గణపతిదేవచక్రవర్తికి సుస్వాగత మొసంగిరి. అక్కన్న బయ్యన్నల యవకతవక పరిపాలన మంతరించెను.

౪

నాఁడు విక్రమసింహపురమున క్రొత్తవెలుఁగు తోఁచెను. ఆ యలంకరణముల తీరు మున్నెన్నఁడు కని విని యుండలేదు. ఇంటింట ముత్యాల రంగవల్లులు, రత్నాల దీపకళికలు శోభ గూర్చెను. ప్రజ లెనలేనియుత్సాహము బ్రదర్శించిరి. ఏనోట విన్నను గణపతిదేవుని ప్రశంసలే – ఏవంకజూచినను విజ యోత్సవములే !

కోటలో గొప్పదర్బారు జరుగునని దండోరా వేయఁ బడెను. కొలువుకూటము కన్నులపండువుగ నలంకరింపఁబడెను. పౌరు లొకరికన్న నొకరు ముందంజగా నిర్ణీతసమయమున కటఁ జేరుకొనిరి. ఒకవంక మంత్రులు, దండనాథులు, సామం తులు నుపవిష్టులైరి. వేరొక చక్కి కవులు, పండితులు, గాయ కులు నాసీనులైరి. రాజభటులు జనసందోహమును సర్ది కూర్చుండఁబెట్టిరి.

అంతలో బిరుదునగారాలు మ్రోఁగెను. మంగళతూర్య ధ్వను లాకసమంటెను. వందిమాగధులు 'పరాకు బహుపరాకు' అని హెచ్చరికలు పల్కిరి. గణపతిదేవచక్రవర్తి మనుమసిద్ధి రాజు, తిక్కనామాత్యుఁడు వెంటరా సభలో నడుగుపెట్టెను. సభాసదు లొక్కుమ్మడి జయవెట్టిరి.

మనుమసిద్ధినృపాలుఁడు సింహపీఠి నలంకరించెను. ఆయన కొక ప్రక్క సార్వభౌముఁడును, మఱొక ప్రక్క సోమయాజియుఁ గూర్చుండిరి. ఆ మూర్తిత్రయము బ్రహ్మ విష్ణు మహేశ్వరు

లుగాఁ జూపట్టిరి. సభ చీమచిటుక్కుమనిన వినఁబడునంత నిశ్శబ్దమయ్యెను.

పురోహితులు రత్నఖచితమైన కిరీటమును గణపతిదేవున కందించిరి. ఆతఁడు చిఱునవ్వుతో తిక్కనవంక దృష్టి బఱపెను. భారతపుత్రి కవిబ్రహ్మచంక దిగలేదు. అతఁడును చక్రవర్తిని సాభిప్రాయముగఁ దిలకించెను.

గణపతిదేవుఁడు మనుమసిద్ధిదిక్కై "మహారాజా! నీ రాజ్యము నీకు మరలదక్కినది. ధర్మరక్షణమునకు నా కవకాశము లభించినది. వీనిని మనకుఁ జేకూర్చినవాఁడు తిక్కన మహామంత్రిసుమా!" అని యేమో నుడువఁబోయెను.

తిక్కన యంతలో నందికొని "అల్లుఁడా!" యని మనుమసిద్ధిని సంబోధించెను. అట్లాతని బిలుచునధికారము, చనవు తిక్కనకే కలదు. భారతరచనమునకు ముం దతఁడు నిర్వచనోత్తరరామాయణమును రచించియుండెను. అప్పుడు,

'ఏనిన్ను మామయనియెడు దీనికిఁదగనిమ్ము భారతీకన్యక' అని మనుమసిద్ధి స్వయముగ నా కృతికన్యను వరించియుండెను. అలనాఁటి సన్నివేశము ప్రజలకు కన్నులకు గట్టినట్లగపడెను.

"గణపతిదేవ సార్వభౌముఁడే మనకు రక్షకుఁడు. ఆశ్రితవత్సలుండగు నాతఁడే రాజ్యప్రదాత" అని తిక్కన యెలుగెత్తి చాటెను.

"కాదేని మహాభారతము!" అని గణపతిదేవుఁ డుల్లస మాడుచు కిరీటమును మనుమసిద్ధి శిరముపై నుంచెను. మనుమసిద్ది గణపతిదేవుల కంజలియొనర్చెను. తిక్కనామాత్యులను గాఁగిలించుకొనెను. సహస్రనయనముల నానందబాష్పములు నిండెను.

"ఖడ్గముమాత్రమే రాజ్యముల సాధించుననుకొనుట బూటకము. గంటమునకుఁగూడ నట్టిశక్తియున్నదని యీ భారతమే చాటుచున్నది. తిక్కనమనీషినిగన్న తెనుఁగు మాగాణము నిజముగా ధన్యమైనది. తెలుఁగువారికీ భారతము కొంగుబంగారమే!" అని మనుమసిద్ధి యుద్బోధించుటతో సభ చాలింపఁబడెను.

# ౪. నారీహృదయము

## ౧

"కాకతీయులఁట! సామ్రాజ్యమఁట! ముక్కలు ముక్కలు చేసితీరవలసినదే!"

"ఆఁడుదానికిఁగూడ రాచఱికమా!"

"రుద్రమ్మ – తప్పు తప్పు – రుద్రదేవ మహారాజులుం గారుటోయి"

"మగరాయనివలె వేషమువేసినంతనే ఆఁడుది పురుష సింహమగును గాఁబోలు!"

"ఇంక ఆ పప్పులుడకవు. మనము చేయిచేసికొనకుండ నున్నంతవఱకే ఓరుగల్లువారి యొప్పులకుప్పలు."

"ఆ రాజ్యమును గూలద్రోయుట కిదే యదను. మనకుఁ బ్రక్కలో బల్లెమనిపించిన యా గణపతిదేవుఁడు నేఁడు లేఁడు."

"ఓరుగంటి రాజ్యములోని యొకరిద్దఱు సామంతులను గూడ మనపక్షమునకుఁ ద్రిప్పుకొను టవసరము."

"కర్నూలు మండలాధిపులకును, కటకాధీశులకును గబురువెట్టి యుంటిమిగదా!"



వరంగల్లుకోట - సింహద్వారము.

ఈ విధముగా మంత్రాంగము చేయుచున్న దేవ్వారను కొంటెరి ? కాంచీపురాధిపతి విజయగోపాలుఁడు. చోళరాజు మనుమలిదేవుఁడు, పల్లవవల్లభుఁడు కొప్పెరుంజింగదేవ రాయఁడు, పాండ్యభూపతి. ఈ దుష్ట చతుష్టయ మొకచో సమావేశమై తెలుఁగు వెలుఁగు మలిపివేయఁ గుట్రలుపన్ను చుండిరి. ఇంతలో కర్నూలు మండలాధిపతులగు రాజేంద్ర చోళుఁడు, పెమ్మయదేవమహీపతి, పెదకొమ్మరాజు వచ్చి చేరుకొనిరి. కటకపుర ప్రతినిధులుకూడ హాజరుపట్టీ వేయించు కొనిరి. మరల ముఖ్యవిషయములపై చర్చ ప్రారంభమయ్యెను.

"సుక్షత్రియులారా ! ఒక యాఁడుదాని పాదముల చెంగట మహాపరాక్రమశాలులు మోకరిల్లుటయా? ఒక యబల ముంగట నుద్దండభుజదండముల మోడ్చి నిలుచుటయా ? వ్యవహార నిర్వాహణమున దలలునరసిన పెద్దలు ముక్కుపచ్చ లారని ముద్దరాలి యెదుట వంగి పలుకు కర్మమేమి ? అసలు స్త్రీకి రాజ్యార్హత యెక్కడిది ? ఆహా ! ఘోత్రమున కెట్టి దుర్గతి పట్టినది ? మగసిరి మంటఁగలిసినట్లేనా ? కిరీటములు ధరించినది పగటివేషగాండ్రవలె తిరుగుటకా ? లేదా దీనికి నిష్కృతి ? ఈ యదను తప్పిన మీకు స్వాతంత్ర్యము సిద్ధించు టెన్నఁడు ?" అని గంభీరమైన యుపన్యాసములతో నా దుష్టచతుష్టయము వారిని ఱెచ్చగొట్టెను.

"ఆఁడుది రుద్రమ యేమి చేయగలదు ? కాని మంత్రి శివదేవయ్య యుద్దండుఁడు. ఆవులించిన ప్రేవులు లెక్కపెట్టఁ గలవాఁడు. ప్రభుత్వపు లగాము లాతని చేతిలో నున్నవి.

ఆతఁడు గణపతిదేవునికడ తరిబీదు పొందినవాఁడని మనము మఱువరాదు” అని రాజేంద్రచోళుఁడు తన యనుమానము వెళ్ళఁబెట్టెను.

“ఓరుగంటి బలములు జన్నగదేవసాహిణుని కనుసన్నల మెలఁగునవి. ఆయన కత్తిపోటు అందఱుము కొద్దియో గొప్పయో చవిచూచినవారమే” అని పెమ్మయదేవమహీపతి గొణిగెను.

“రుద్రమకూడ యుద్ధతంత్రమున నందెవేసిన చేయియే. ఆమె స్వయముగా సేనల నడపగలదు; వ్యూహములను పన్నఁగలదు” అని పెదకొమ్మరాజు పలికెను.

“అంబయదేవుఁడు, త్రిపురాంతకుఁడు, గోనగన్నారెడ్డి మున్నగువారు మాత్రము సామాన్యవీరులా! పౌరుషప్రధానులగు కమ్మవారు, రెడ్లు, వెలమలు ఆమెకు పెట్టనికోటలు. కావుననే రుద్రమదేవి యాటలు సాగుచున్నవి” అని కటకము వారుకూడ నంగినంగిలాడిరి.

అంత పాండ్యభూపతి వెడనవ్వుతో “మీరు గోరంతలు కొండంతలు చేయుచున్నారు. అందఱు నన్నివైపులనుండి ముట్టడించిన ఆమెకాదు–యామె తలలోని జేజెమ్మయైన లొంగి తీరవలసినదే” అని ఱాయి గుద్దెను.

“మీ సామంతులందఱు తిరుగఁబడిన యామె యడ కత్తెరలోని పోకవలె కాదా? పైన మేము బాసటగా వచ్చుచుంటిమిగదా!” అని పల్లవరాజు మీసములు మెలివెట్టెను.

"సామంతులుకూడ నందఱు నొక్కత్రాటిపై నడచువారుకారు. ఎవరి స్వార్థము వారిది. మఱియొక విశేషము. సాక్షాత్తు కాకతి దేవతయే రుద్రమగా నవతరించినదని ప్రజల మూఢవిశ్వాసము" అని రాజేంద్రచోళుఁడు వాకొనుచుండఁగనే కొప్పెరుంజింగఁ డుత్తేజితుఁడై లేచి యిట్లు పలికెను.

"ప్రజలది గొఱ్ఱెదాటు. వారితో మన కేమి? మీస మేషములు గుణించుచు నాడుపెత్తనము, తంబళి దొరతనము సాగనిత్తుమా? అసంభవము. అవమానము రాజలోకమునకు!"

పాండ్యభూపతి కొప్పెరుంజింగని శాంతపఱచి యిట్లుపన్యసించెను. "దేవగిరి యాదవరాజుకూడ కాకతీయ రాజ్యముపై గన్నువేసి యున్నాఁడు. ఆ మహాదేవరా జిప్పుడే కార్యరంగమున కుఱుకుచున్నాఁడని విందుము. ప్రజలలో విప్లవబీజము నాటుట కాతఁ డెంతయో శ్రమపడుచున్నాఁడు. ఆయన చారులు వాడవాడల, ఇంటింట నెక్కడచూచినఁ దామై తిరుగుచున్నారు. పగటివేషములతో, బుఱ్ఱకథలతో ప్రచారము సాగించుచున్నారు. రుద్రమ్మ జ్ఞాతులు హరిహరదేవ మురారిదేవులు మన కనుకూలురు. సమయము గనిపెట్టి వారు కోట నాక్రమించుటకు పొంచియున్నారు."

అంతలో కంచి విజయగోపాలుఁడు కలుగఁజేసికొని "ఇన్ని యనుకూల పరిస్థితు లెన్నఁడో కాని కలుగవు. కర్ణాటలు వారు, కటకమువారు నేలకో జంకుచున్నారు" అని యెత్తిపొడిచెను.

"సాధక బాధకములను చర్చించితిమి కాని జంకి కాదు. విప్లవము లేనదియుటకు మాది ముందంజయే" అని రాజేంద్ర చోళుఁడు పరువు నిలుపుకొనెను. కటకమువారును 'తందాన' యనిరి.

అంతలో కొందఱు చారులువచ్చి పాండ్యరాజుతో నేమో గుసగుసలాడిరి. అతఁడును మహోత్సాహముతో "మా వేగులవారు శుభవర్తమానము మోచి తెచ్చినారు. రుద్రమదేవి వడ్డెపల్లెగణపతికి, ఓగిలిచర్ల యేకవీరాదేవికి, ఐనవోలు మైలారుదేవునకు మ్రొక్కుబడులు చెల్లించుటకు రాజధాని విడిచి యరిగినదఁట ! హరిహరదేవమురారిదేవు లీ యదను వృథపుచ్చరు. ఆమె మరల కోటలో నడుగుపెట్టఁజాలదు" అని దృఢముగా బలికెను.

"మంచిశకునము ! మనకిది యోగకాలము" అని కొప్పెరుంజింగఁడు ఎగిరి గంతువైచెను.

పిమ్మట అందఱు నేకమై ముందు కార్యక్రమమును రూపొందించిరి. ఎవరు ఏపాత్ర నెట్లు నిర్వహింపఁదగునో నిర్ణయింపఁబడెను. పరిస్థితు లెప్పటికప్పు డొకరికొకరు తెలుపుకొనుట కేర్పాటయ్యెను. ఆ సమావేశమంతటితో ముగిసెను.

౨

అది యోరుగల్లులోని రహస్యాలోచన మందిరము. మహారాజ్ఞి రుద్రమదేవి యందొక బంగరుగద్దియపై నాసీన

యయ్యెను. ముఖ్యమంత్రి శివదేవయ్య, దండనాథుఁడు జన్నిగ దేవసాహిణుఁడు నామె కిఱువంకల గొలిచియుండిరి. తక్కొరుల కందు ప్రవేశము లేదు. రాజకీయములనుగుఱించి యేకాంతముగఁ జర్చింపవలసివచ్చినప్పుడు వారందు సమావేశమగుట పరిపాటి. వారియాలోచన లెట్టివో వారిముఖముననే విందము.

రుద్ర:—హరహరిదేవ మురారిదేవు లెంతకుఁ దెగించినారు! దాయాదులని సమ్మినందుకు కోటనే యాక్రమించినారు.

శివ:—తిన్నయింటి వాసములు లెక్క వెట్టు దుష్టులు! తగిన శిక్షపొందినారు. వారి సర్వస్వము ప్రభుత్వపుబొక్కసమునకు చేర్చినాము.

రుద్ర:—దండనాథా! దక్షిణాపథ విశేషములేమి?

జన్న:—మన యంబయదేవుని నాయకత్వమున నోరుగంటి సైన్యము లఖండ విజయములను సాధించినవి. కంచిరాజు కాలికి బుద్ధిచెప్పెను. చోళులకు చుక్కెదురైనది. పల్లవ బలములు పంచబంగాళమైనవి. పాండ్యసైన్యము పటాపంచలైనది.

శివ:—అంబయదేవుఁడు నేఁడెల్లి రాజధాని చేరుకొనఁగలఁడని నేఁటివార్తలు తెలుపుచున్నవి.

రుద్ర:—కటకపుదొరలకుఁగూడ కన్నులు నెత్తికెక్కినవిగదా!

జన్న:—మనసేనానులు పోతయ నారయ లావిప్లవము నణఁచి వేసినారు. మునుపటివలెఁ గప్పముగట్టుట కాతఁ డొడఁబడెను.

శివ:—దేవీ! చిల్లరసామంతులుకూడ మరల నదుపులోనికి వచ్చినట్లే. సమరగాంగేయులు గణపతిదేవులు నేఁడు లేరు గదాయని యందఱిన్నివిధముల నాటకమాడినారు.

రుద్ర:—ఆడకేమి? సింహాసనమున నున్నది యొక్క యబల కదా!

జన్న:—మహారాణి కాకతిదేవత యపరావతారమని యీ మూర్ఖు లెఱుఁగరు.

శివ:—ఇంతలో ఉత్తరమునను దక్షిణమునను ఉపద్రవము లెవ్వియుఁ దలయెత్తఁజాలవు. ఇంక దేవగిరి మహాదేవరాజు పనిమిగిలియున్నది.

రుద్ర:—అసలీ కుట్రల కన్నిటికి మూలకంద మాతఁడేకదా!

శివ:—ఔను. అతఁడును రాణిగారితోఁబాటు సింహాసన మెక్కినవాఁడు. గణపతిదేవులు స్వర్గస్థులైన సంవత్సరము ననే యాదవరాజగు కృష్ణభూపతియు మరణించెను. ఆ తండ్రికొడుకే యీ మహాదేవరాజు.

జన్న:—అతఁడు స్త్రీహత్య, శిశుహత్య గిట్టని పరమధార్మికుఁడఁట! కావుననే మాళవులొక శిశువును, కాకతీయు లొక స్త్రీని సింహాసన మెక్కించి ప్రాణములు దక్కించుకొనఁ జూచుచున్నారఁట!

శివ:—ఈ భట్రాజు పొగడ్తలే యాతని నీస్థితికిఁ దెచ్చినవి. మన ప్రజలలో కల్లోలము రేపుటకు పాపము! పడరాని పాట్లుపడినాఁడు.

రుద్ర:—ప్రజల యనురాగమే మనకు శ్రీరామరక్ష. వారు మన కండగా నున్నంతవఱకు ఫాలాక్షుఁ డెత్తివచ్చినను జంకఁ బనిలేదు.

జన్న:— జైనులుమాత్రము విద్రోహులతో చేతులు కలుపుచున్నారు. వారి యారామములు శత్రువులకుఁ బంచమాంగదళములుగాఁ బనిచేయుచున్నవి.

శివ:—తిక్కనామాత్యులు వారితో డీకొన్న నాఁటినుండి వారికీ దుర్బుద్ధి పొడమినది.

రుద్ర:—మనము వారిపై నొక కన్నుంచియే మెలఁగవలెను.

జన్న:—విద్రోహుల చర్యలను మొగ్గలోనే త్రుంచివేయఁ గలిగితిమి. లేకున్న పరిస్థితులు మనచేయి దాటిపోయెడివే. యాదవరా జిప్పుడు ఱెక్కలూడ్చిన పక్షియైనాఁడు.

శివ:—ఒకపట్టున నాతఁడు విరమించువాఁడు కాఁడు, అనతి కాలముననే యాతఁడోరుగల్లుపై దండువిడియింప నున్నట్లు వినికిడి.

రుద్ర:—మన రక్షణసన్నాహము లెట్లున్నవి?

శివ:—ఆవిషయమున దేవిగారు యోజింప నక్కఱలేదు. కోటలోని శిథిలభాగములన్నియు బలిష్ఠములు చేయఁబడినవి. కంపకోట, మట్టికోట చెక్కుచెదరకయున్నవి. తమ తండ్రిగారు పురమాయించిన ఱాతికోటకూడ పూర్తియైనట్లే. కీలక స్థలములందు గట్టి పహరా లేర్పాటు చేసినాము. అగడ్తలు జలప్రపూర్ణములై యున్నవి.

దండ:—మహారాజ్ఞి! మామేన తుదిరక్తపు బొట్టు నిలిచి యున్నంతవఱకు తమపై నీఁగ వాలనీయము. మీరు నిశ్చింతగా నుండుఁడు.

రుద్ర:— ముక్కాకలుతీరిన మీకు నేను వేఱుగా చెప్పఁబని లేదు. కాని వేయికన్నులతోఁ గనిపెట్టి యుండవలసిన సమయమిది. ఎన్నియో కష్టములుపడి ప్రోలరాజులవారు కాకతీయ సామ్రాజ్యమునకుఁ బునాదులు వైచినారు. పెద తాతగారును, నాయనగారును దాని నిర్మాణమునకే జీవితములు ధారవోసినారు. ఒకయాఁడుదాని పాలనమున నది విచ్ఛిన్నమయ్యె ననుమాట పుట్టరాదు. వీరగడ్డయగు మన తెలంగాణమున కపఖ్యాతి కలుగరాదు.

శివ:—మహాదేవరాయల కీ దెబ్బతో తెలుఁగువారి పస తెలిసి రాఁగలదు. ఎప్పటి సమాచారము లప్పుడే దేవిగారికి నివేదించుచుందుముగదా! మాకు సెలవిండు.

నాఁటి రహస్య సమావేశ మంతటితో ముగిసెను.

## 3

దేవగిరి మహాదేవరాజునకు దూరదృష్టిసున్న. కాని మూర్ఖపుఁబట్టుదల హెచ్చు. అందును తగని రాజ్యతృష్ణ. ఆతఁడు సింహాసనమెక్కిన నాఁటనుండి కాకతీయ సామ్రాజ్యముపైఁ గన్నువైచియుండెను. గణపతి దేవునకుఁ బుత్రసంతా

సము లేనందున కుమార్తె రుద్రమదేవి రాజ్యభారము వహించెను. ఇది తనకు మహదవకాశమని మహాదేవుఁడుబ్బితబ్బిబ్బులయ్యెను. 'ఒక్క యబల నోడించు టెంతటిపని ?' యని యాతఁడు తన పన్నుగడలను సాగించెను.

తొలిచర్యగా కొందఱు సామంతులను చీలదీసెను. వారి కేమేమో బాసలుచేసి యఱచేత మోక్షమును జూపించెను. సరిహద్దురాష్ట్రముల ప్రభువులనుగూడ రుద్రమదేవిపైఁ బురికొల్పెను. సామ్రాజ్య ప్రజలను తిరుగుబాటు చేయుటకుఁ బ్రోత్సహించెను. కడకు మహారాణి దాయాదులనుగూడ తన వలలోవేసికొనెను. కాని తానొకటి తలఁచిన దైవమువేఱొండు తలంచును. కుట్రలన్నియు బయల్పడెను. కాకతీయసైన్యము లెక్కడి పితూరీ నక్కడనే యణఁచివైచెను. ఇఁక యాదవ రాజున కండగా నిలిచినవి జైనసంఘములు మాత్రమే.

ఇట్లయ్యును మహాదేవరాజు విరమింపలేదు. ఎదిరి బలమును సరిగా నంచనా వేయలేకపోయెను. ఒకనాఁటి నడురేయి మూఁడులక్షల బలముతో నేకశిలానగరముపై దండువిడిసెను. దిక్కులదరునట్లు రణభేరి మ్రోఁగించెను. తెనుఁగుబలములు కూడ నాదమఱచియుండలేదు. అవి వెంటనే శత్రువులకుఁ దగినరీతి జవాబొసంగెను.

ఓరుగంటియోధులు శత్రువులను శరవర్షమున ముంచెత్తిరి. వీరనారి రుద్రమదేవి పురుషవేషముధరించి స్వయముగ రణాంగణమున నవతరించెను. ఎచ్చట చూచిన తానయై వీరవిహారము సలుపుచుండెను. శత్రువుల వ్యూహములు పటా

పంచ లగుచుండెను. దినములు గడఁచు కొలఁది దేవగిరి బల ములు పలుచబడఁ జొచ్చెను. మహాదేవరాజునకు కోటను భేదించు వెరవుకన్పట్టదయ్యెను. తొల్లటి కుట్రదారు లెవరైనఁ దన్నుఁ గలియవత్తురేమోయని యాతఁడు ప్రతీక్షించెను. కాని యట్టి పొలకువయే కానరాకుండెను. ఆతని పండ్లబిగితగ్గెను. సైనికులలో నుత్సాహము సన్నగిల్లెను.

ఈ యదను గ్రహించుటకు కాకతీయ బలముల కెక్కువ కాలముపట్టలేదు. సర్వసైన్యములును గోటవీడి యొక్క యుమటునఁ బగతురపై లంఘించెను. దేవగిరి బలములు దారి తెన్నులుతోఁచక నానాముఖములఁ జెదరిపోయెను. మహాదేవ రాజునకుఁ బలాయనము చిత్తగింపక తప్పలేదు. కాని యాంధ్ర సైన్యములు వెన్నంటి తఱుముకొని పోయెను. తుదకు మహా దేవరాజు ప్రాణములతో పట్టువడెను.

౪

ఏకశిలానగరము మఱల విజయోత్సవములతో సంద డించెను. మహారాజ్ఞి నిండుకొలువు తీరియుండెను. ప్రజ లిసుక వైచిన రాలకుండ వచ్చిచేరిరి. బిరుదునగారాలు మ్రోఁగుటతో కార్యక్రమము ప్రారంభమయ్యెను.

రుద్ర:—బందీ యెచ్చట ?

శివ:—దేవీ ! మన జన్నిగదేవసాహిణుఁ డదే ప్రవేశపెట్టు చున్నాఁడు.

మహాదేవరాజు విచ్చుకత్తుల పహారాతో లోనికిఁ గొని రాఁబడెను. అతఁడును మహారాజ్ఞిముంగట మోకరిల్లి యంజలి ఘటించి నిలువఁబడెను.

రుద్ర:—ఓహో! మహాదేవరాజులుంగారా! ఆడుదానికడ మోకటిల్లుటయా!

మహా:—మహారాజ్ఞి! చచ్చినపాముపై నేల బడితె విసరెదవు? నేఁటికి నాతప్పు తెలిసికొంటిని. క్షమింపుము.

ప్రజలు:—అందినజుట్టు - అందకున్నకాళ్లు. క్షమింపరాదు.

రుద్ర:—మహాదేవా! ఆఁడుది యనిన నేమనుకొంటివి? పనికి మాలిన యబలయనుకొంటివి కాఁబోలు! స్త్రీయనిన పరాశక్తి యని గ్రహింపుము. ముజ్జగము లామె కడగంటిచూపులో బందెవడియుండుట గమనింపుము. ఆ యాది శక్తియే ప్రజలకు తల్లికూడ. కావుననే యాఁడుదాని హృదయము వజ్రముకన్న కఠినము; నవనీతముకన్న మృదులము. శరణన్న పగతునైన రక్షించుట మా కులాచారము. ఆదిశక్తినై నిన్ను జయించితిని; మాతనై నిన్ను క్షమించుచున్నాను. మహామంత్రీ! మహాదేవరాజును రాజలాంఛనములతో సగౌరవముగ మనయెల్ల దాటఁబంపుము. సరిహద్దున 'రుద్రదేవచక్రవర్తి' యని మాపేరున జయస్తంభమును నాటించుము.

**శివ:**—చిత్తము.

ప్రజలు:—జయము జయము రుద్రమదేవి మహారాజ్ఞికి !

రుద్ర:—మంత్రిపుంగవా ! మఱియు నొక్క సంగతి. దేశరక్షణమున నసువులుబాసినవారి కుటుంబములకు శాశ్వతభృతుల నేర్పాటుచేయుఁడు. తక్కిన జోదులందఱకు దగురీతిఁ బసదనములొసంగి మన్నింపుఁడు.

ప్రజల జయజయ ధ్వానములతో మహారాజ్ఞి కొలువు చాలించెను. రుద్రమదేవి విజయవార్తలు ఢిల్లీనగరమున గూడ పాక్కెను. ఆమె కీర్తిపుష్పము తెలంగాణముననేకాక యావద్భారత దేశమునను బరిమళముల వెదజల్లెను. ఆమెయెంతటి వీరనారియో, యంతటి దయార్ద్రహృదయ. ప్రజలామెను 'అంబా' యని పిలుచుటొక వింతకాదు.

---



ప్రతాపరుద్రుని శిరస్సు.

# ౩. ప్రతాప చరిత్రము

## ౧

"సలాం ఆలేకుం"

"అస్సలాం ఆలేకుం. కుశలమా దేవగిరి రాయలకు ?"

"అలాఉద్దీను పాదుషావారును, వారి ప్రధాన దండనాథుఁడును మాయందు కరుణ వెలయించుచుండఁగా మాకు కుశలమున కేమి కొఱంత ?"

"పాదుషావారు మీ క్షేమలాభములను మాముఖమున తెలిసికొని మిక్కిలి సంతసింపఁగలరు."

"మహాప్రసాదము. మలిక్ కాఫూర్ మహాశయా! తమ యాగమనమున కేదో ముఖ్యకారణ ముండియుండును."

"రాయలు చక్కఁగా గ్రహించినారు. పాదుషావారు మీ ప్రక్కలో బల్లెమును పెఱికివైచి మీ కానందము గలిగించుటకై మమ్ము నియోగించి పంపినారు."

"ఓహో ! ఆ ఓరుగంటి ప్రతాపరుద్రుని పీచమడంచుటకా మీ యీ విజయయాత్ర ?"

"రాయలు కుశాగ్రబుద్ధులు. మీ వంగడమునకు చిర శత్రువులుగా నుండి మీ ప్రక్కలో బల్లెముగా నున్నారు

కాకతీయులు. వారితోఁ బోరుచునే సింఘణరాయలు మరణించెను. మీ తండ్రిగారు మహాదేవరాయలకు కాకతి రుద్రమ్మ చేసిన పరాభవము మఱువఁదగినదా ?"

"మలిక్ మహాశయా! గుండెలోని వ్రణమును పుండరించుచున్నారు. ఆ కాకతీయులను సర్వనాశనము చేసినఁగాని నాకు తృప్తి కలుగదు."

"మీకు తృప్తి కలుగుట యటుంచుఁడు. అంతవఱకు మీ పితృదేవతలకు శాంతియుండునా ? పితౄణము తీర్చుకొనుట మీ ధర్మము గాదా ?"

"నిజమేకాని ప్రతాపరుద్రుఁడు – సార్థకనామధేయుఁడు."

"రాయల నోట ఓటిమాటలు వినఁబడుచున్నవి !"

"సంగతి మీకు విశదమగుటకు తెలుపుచున్నాను. రుద్రమ్మ రాజ్యావసానకాలముననే యాతఁడు ప్రచండ పరాక్రమముతో దిగ్విజయము చేసినాఁడు. నాఁటి సంగతులు మఱపు రాకున్నవి."

"అవి అలాఉద్దీను పాదుషావారు కలుగఁ జేసికొనని రోజులు."

"ఔనౌను ! పాదుషావారు కన్ను తెఱచిన కాకతీయులేమి ? ప్రపంచమే కన్ను మూయును."

"ప్రస్తుతము కాకతీయరాజ్యపరిస్థితు లెట్లున్నవి ?"

"ప్రతాపరుద్రుఁడు రాజ్యమునకు రాఁగానే దక్షిణమున నొక విప్లవము పొడసూపినది."

"ఏమది ?"

"నెల్లూరిపాలకుఁడైన మనుమగండ గోపాలుఁడు తిరుగుబాటు చేసెను. ఆతనికి గండికోట పాలకులు త్రిపురాంతకాంబదేవులు వడియెక్కించిరి. కాని వారు ప్రత్యక్షముగ విప్లవమున పాలుగొనకుండుటచే మనుమగండని ప్రయత్నము మంటఁగలిసినది. ఆదిదమ్మ సేనాని మనుమగండనిఁ జంపి విజయోత్సాహముతో ఓరుగల్లు చేరెను."

"ఆ కాయస్థులు మనుమగండని గోతిలో దింపినట్లైనది. మీ హిందువుల ప్రయత్నములలోని లోపమే ఇది. లోపిటికి, వెలిపిటికి. త్రిపురాంతకాంబదేవులుగూడ చేయి కలిపినచో మఱికొందఱు సామంతులు కలిసియుందురు. పట్టుదల విజయమునకు మూలకందము. అదియేకొఱఁత మీవారిలో."

"ఇంకను త్రిపురాంతకాంబదేవులు ప్రతాపరుద్రునిపై కారాలు మిరియాలు నూరుచున్నారని వినికిడి."

"రాయమహాశయా! పాదుషావారు త్రిలింగరాజ్య విధ్వంసమునకు కంకణము కట్టుకొన్నారు. కనుక మీరావిషయమున నిశ్చింతులుగ నుండవచ్చును. కాని యిప్పుడు మీరొక సాయము చేయవలసియున్నది."

"ఏమైనను తలతోఁ జేయుటకు సిద్ధముగ నున్నాను."

"ఆ కాయస్థులకు మీరు సర్వవిధముల పురిఁయెక్కించి విద్రోహమునకు సిద్ధపఱుపుఁడు. మేమిప్పుడు సరాసరి ఓరుగంటి మీఁదికి నడచెదము."

"తంత్రము చాల చక్కఁగ నున్నది. తప్పక యట్లే చేయుదము."

సుమారు పదియేండ్లనాఁడు అలాఉద్దీన్ దక్కను ప్రతినిధిగా వచ్చి దేవగిరిని హతభాగ్య మొనర్చియుండెను. ఆ దెబ్బ రామదేవుఁడు మఱువలేదు. అలాఉద్దీన్ నేఁడు చక్రవర్తి. దేవగిరిమీఁదఁ బడినప్పుడే అలాఉద్దీన్ ధనధాన్య భరితమైన తెలంగాణముపై కన్నువేసెను. కాని అప్పటి కవకాశము చిక్కినదికాదు. అతఁడు భారతదేశ చక్రవర్తి కాఁగానే మలిక్ కాఫూరును మహావాహినులతోఁ బంపినాఁడు.

ఈవార్త చారులు బేగిరావులపై ప్రతాపరుద్రచక్రవర్తి కందఁజేసిరి. నాగయగన్న మంత్రి ముక్కుపై వ్రేలు వైచుకొనెను. దేవగిరిరాయ లెంతకు తెగించినాఁడు? లజ్జావిహీనతకును ఒక హద్దుండవలదా? మనలో మన కెన్ని తగవులున్నను వైరులకు మనమందఱము నొకటే యను భారతధర్మమును మంటఁగలిపినాఁడే! భారతదేశము తురుష్కాక్రాంతమగుటకుఁ గల కారణమును గమనించిన తరువాతఁగూడ నిట్టి వికట వర్తనమా? మేచయనాయకుని చేయి మీసము నప్రయత్నముగా వడిపెట్టెను. బెండపూడి అన్నయమంత్రి చేయి కరవాలమునంటెను. ఆంధ్రచక్రవర్తి కన్నులు నిప్పులుకురిసెను. దక్షిణ భారతము తురుష్కాక్రాంతమైననాఁడు భారతధర్మము

నకు నిలువనీడయుండదు. అందును భారతీయుల తోడ్పాటుతో భారతధర్మ విధ్వంసనము జరుగుట కడుంగడు శోచనీయము గదా!

రుద్రాలికనయన జ్వాలలవలె ఆంధ్రవాహినులు రజోధూమమున నాకసము గప్పుచు, కటారి మిల మిలల నాలుకలు వైరులదెస చాచుచు బయలువెడలెను. మేచయనాయకుఁడు, ఎల్లయ్య నాయకుఁడు, బెండపూడి అన్నయమంత్రి మొదలగు మేటిమగలు సేనానాయకులుగ నుండిరి.

ఆంధ్రవాహినులు గోదావరీతీరముఁ జేరెను. రేవులన్నియు శత్రుదుర్గమములుగ కట్టుదిట్టముచేయఁబడెను. శత్రువులకై ప్రతీక్షించుట యాంధ్రవీరులకు శవజాగరణమువలెఁ దోఁచెను. వారు తగినబందోబస్తుతో గోదావరి దాఁటి ఎదురు నడచిరి. ఇంతలో తురుష్కవాహినులు సమీపించెను.

ఆంధ్రవీరులలో మహోత్సాహము పెల్లుబికెను. తుఱకదండు బిట్టుఱికెను. ఆంధ్రసింహములు గర్జించెను. సంకులసమరము జరిగెను. దేవగిరిరాయల తాఁకిడికిని తెలుఁగు రాయల తాఁకిడికిని మిక్కిలి యంతరము గలదని మలిక్ కాఫూరునకుఁ దెలిసివచ్చునప్పటికి తురుష్కసైన్యము పటాపంచలయ్యెను. వరాహలాంఛనుల వాఁడికటారి మొనలే తన చుట్టును మెఱయుచున్నట్లు మలిక్ కాఫూరునకు దేవగిరి చేరువఱకును తోఁచుచుండెను. పుట్టెఁడవమానముతో దేవగిరి రాయలను చూడలేక మలిక్ కాఫూరు మొగము తప్పించి

హాతశేషులతో ఢిల్లీ చేరికొనెను. గంపెఁడాసతో నున్న దేవగిరిరాయలు మొగ మింతచేసికొని యూరకుండెను.

ఆంధ్రసైన్యములు విజయోత్సాహముతో రాజధాని చేరెను. ఇంటింటను పండుగలే !

ఇంతలో మఱొక యుపద్రవవార్త వచ్చెను. నెల్లూరి చోడుని రెచ్చఁగొట్టి వాని మరణమునకుఁ గారకులైన త్రిపురాంతకాంబదేవులు స్వయముగా విద్రోహమునకు దిగిరి. గండికోటవారి యీ సాహసమును దేవగిరిరాయలు విషము పోసి పెంచెనని స్పష్టముగాఁ దెలియవచ్చెను. రాజధానిలోని వీరులందఱకును తుఱకలు పనిచెప్పెదరు. మనకింక అడ్డులేదని కాయస్థుల భ్రమ. తురుష్క దండయాత్ర యింత సులభముగా తేలిపోవునని పాపము ! వారు కలనైనఁ దలఁచి యుండలేదు. మేచయనాయకుఁడు, గుండయనాయకుఁడు, సోమయ లెంక మహావాహినులతో వచ్చిపడిరి. త్రిపురాంతకాంబదేవు లగ్నిలోఁ బడిన శలభములైరి. సోమయ నాయకుఁడు గండికోట రాజప్రతినిధి యయ్యెను.

౨

“మలిక్ ! చూచితివా, దేవగిరి రామచంద్రుని యవినయము ?”

“జహాఁపనాహ్ ! హిందువుల కిదియొక దీర్ఘరోగముగా దోఁచుచున్నది. ఎదుట నున్నంతవఱకు తియ్యనిమాటలు —

వెన్ను త్రిప్పినఁజాలు, విద్రోహము! మొన్నటిసారి నిజముగా ఆ రామచంద్రుఁ డెంత వినయము చూపినాఁడు! అరఁటిపం డొలిచిపెట్టినట్లు కబుర్లు చెప్పినాఁడు. అవియన్నియు నక్కవినయములని కలనైనఁ దలఁపలేకుంటిని.”

“పైఁగా, కప్పము నడుగఁగా ఎంతదురుసుగా మాటలాడినాఁడు! మన యుద్యోగులు చెప్పిన పలుకులు – అవి పలుకులుగావు, ములుకులు. ఏమనినాఁ డా రామచంద్రుఁడు? సిద్దీక్!”

“జహాఁపనాహ్! అవి మరల మానోట నుచ్చరింపఁ గలమా? ‘మాసైనికులు తఱిమితఱిమి కొట్టిన తెలుఁగువారి కోడి గాజులు తొడిగించుకొని చెప్పకుండ పాఱిపోయిన వాజెమ్మలకు కప్పమడుగుటకు సిగ్గులేదా?’ యని గద్దించి నాఁడు. వానినాలుక వేయిచీలికలు చేయించవలెను ప్రభూ!”

“మలిక్! వింటివా?”

“జహాఁపనాహ్! ఇంకవిననక్కఱలేదు. వినాశకాలము నకు విపరీతబుద్ధి. వాని నింక నమ్మరాదు. ఆ విషసర్పమును లేవకుండఁ గొట్టినగాని మనమార్గము నిష్కంటకము కాదు. క్రిందటిసారి తంత్రము నడపుటకై వానికి లేనిపోని గౌరవము చూపితిని. దానితో వాని కన్నులు నెత్తికెక్కినవి. దేవగిరి వానితోపాటు ఆ తెలుఁగువాని పొగరుకూడ దింపి మరల దర్శనము చేసికొందును. సెలవు.”

* * *

తెల్లవాఱుసరికి తుఱకదండు దేవగిరిదుర్గమును చుట్టుముట్టెను. అశక్త దుర్జనత్వము చూపెనేగాని రాయలకు తురుష్కుల నెదిరించు బలమెక్కడిది? వాచాదోషమునకు ఫలితముగా తన సర్వస్వమును నిలువుదోపిడి యిచ్చి దాసోహమ్మనక తప్పలేదు. దేవగిరిలక్ష్మి ఢిల్లీపాదుషా పాదకమలము నాశ్రయించెను. మలిక్ కాఫూరు కొంత విశ్రాంతి తీసికొని ఏకశిలానగరమార్గము పట్టెను.

చారచక్షువగు ప్రతాపరుద్ర చక్రవర్తి కెప్పటి వార్తలప్పుడే యందినవి. గండికోటనుండి సేనలు మఱలివచ్చినవో లేదో, అప్పుడే యీ దుర్వార్త! అయిననేమి? విజయోత్సాహముతో పొంగులువాఱుచున్న తెలుఁగువీరులకు తమశ్రమ మీఁద ధ్యాసయేలేదు. పద్మనాయకవీరులకు పండుగవలె నుండెను. దాచానాయకుఁడు, రుద్రనాయకుఁడు, మాయిదేవు లెంక మున్నగు వెలమవీరులు మీసములు వడిపెట్టుచు ముందంజ వైచిరి. సాహిణిమారయ తన యశ్వదళముతో సిద్ధపడెను. తెలుఁగువీరులు మహోత్సాహముతో మరల గోదావరి దాఁటి తురుష్కుల నెదిరించిరి.

పాపము! మలిక్ కాఫూరు తాను ఏమఱిపాటున తెలుఁగువారిపైఁ బడుచుంటిననుభావములో నుండెను. తుఱక సరదారు లోరుగంటి దుర్గద్వారము నెదుట నింద్రజాలము చేయఁగలమని కలలు గనుచుండిరి. ఒక్కొక్క తెలుఁగుభటుఁడు నొక్కొక్క దుర్గద్వారముగా నెదురైరి. తురుష్కులు దిగ్భ్రాంతులైరి. ఏమీ తెలుఁగురాజు వేగు చూపు! ఏమీ తెలుఁగు

వీరుల సాహసము! మలిక్ కాఫూరు పథకము తారుమారు అయ్యెను. అతని యాకాశసౌధములు నేలఁగూలెను. మరల పరాభవముతో పాదుషా మొగము చూడలేఁడు. కాని యతనిపండ్లబిగి యక్కడకు రాలేదు. దక్షిణాపథము దాఁటువఱకు తెలుఁగువీరుల వాఁడిబాణములు కాందిశీకులైన తురకల వెన్నంటుచునేయుండెను. హతశేషులు పాపము! వింధ్యపర్వతములు దాఁటి వీఁపులు తడవిచూచుకొనిరి.

ఈ విజయముతో పద్మనాయకవీరుల ప్రతిష్ఠ హెచ్చెను. ప్రతాపరుద్రచక్రవర్తి వారిని బహువిధముల బహూకరించెను. చక్రవర్తికడ వారిపలుకుబడి యిబ్బడిముబ్బడి యయ్యెను. ఒకరిపచ్చ యొకరి హృదయములో మచ్చయగును. సమాన స్కంధులుగనున్న రెడ్డినాయకులలో కొంత సంచలనము చూచాయగాఁ దోఁచెను.

## 3

“ఔరా! ఏమి కాలగతి! పొరుగు తెలుఁగువారు మాటి మాటికిని తురుష్కులను జయించి తఱుమఁ గొట్టుచున్నారు. రెండు పర్యాయములును మ్లేచ్ఛులు నా సర్వస్వము నపహరించి పోయిరి. పైఁగా ప్రతిసంవత్సరమును కప్పము నారాజ్యమును పీల్చి పిప్పి చేయుచున్నది. కులవైరులయిన తెలుఁగువారి దృష్టిలో నారాజ్య మొక గడ్డిపోఁచకన్న కనాకష్టముగ నున్నది. నారాజ్య మెట్లున్నను ఆ తెలుఁగువారిని నాశనము చేయనిది నిద్రపోరాదు.”

ఇట్లు తలపోయుచు దేవగిరి రామదేవరాయలు చంద్ర శాలపై కాలుగాలిన పిల్లివలె తిరుగుచుండెను. ఏమిచేయుటకును తోఁచుటలేదు. ప్రబలమగు ఢిల్లీసుల్తాను సేనలే తెలుఁగు వారి నెదిరింపఁ జాలనప్పుడు ఇంకవారిని నాశనము చేయు వెరవు కనిపించుటలేదు. ఇంతలో నతని మొగమున నొక పైశాచిక మందహాసము తోఁచెను.

"ఆఁ! మంచి యుపాయము తోఁచినది. ఇదే తగిన సమయము. ఆంధ్రవీరులందఱును కరవాలములు వదలి గంటములుపట్టి నిశ్చింతగా కావ్యవినోదములఁ దేలుచున్నారని గదా వేగులవార్త! తెలుఁగువీరులారా! మీకు వినాశ కాలము దాఁపురించినది. హాయిగా నృత్తగీతకావ్యవినోదముల కాలక్షేపముఁ జేయుచు కులుకు చున్నారా! మీ ఆయువులు విద్యామంటపముననే బలియగును లెండు. వీరి ట్లాదమఱచి యున్నసమయముననే సుల్తాను సైన్యము సరాసరి ఓరుగల్లు దుర్గద్వారమున నకస్మాత్తుగ ప్రత్యక్షము కావలెను. తురుష్కుల యగ్నిగోళములు దుర్గమును భస్మీపటలముచేసి తీరవలెను! స్వర్గమునందలి మా పితృదేవతలు శాంతినొందుదురుగాక!"

ఈ దురాలోచన తోఁచుటేమి? ఢిల్లీకి వార్తాహరులు ఱెక్కలుకట్టుకొని వ్రాలుటేమి?

చక్రవర్తి యానందమునకు మేరలేదు. ఈసారివిజయము తప్పక తమదేయని మలిక్ గర్జించెను. తురుష్కవాహినులు హుటాహుటి ప్రయాణముల మేఘములపైఁ బోవసాగెను. గుట్టలనక, మిట్టలనక, వాఁగులనక, వంకలనక, పట్టుదలతో

ప్రయాణముచేసి తురుష్కులు తెలుఁగు పొలిమేరనున్న సిరిపురము చేరిరి.

తెలుఁగుపొలము కనఁబడుసరికి వారిలోని పశుప్రవృత్తి ప్రజ్వరిల్లెను. వారు విజృంభించి కొంపలను, పంటలను తగులఁబెట్టిరి. కనుపడినవారిని కనుపడినట్లు చిత్రవధ సలిపిరి. అమాయికులగు ప్రజల ధన మాన ప్రాణములు వారి పశుప్రవృత్తికి బలియయ్యెను.

ఇరువురు సేనానులు, నలువదిమంది విలుకాండ్రును ముందుగా అనుమకొండ చేరిరి. అనుమకొండ తెల్లవాఱుసరికి తురుష్క సైనికనికాయముతో నిండిపోయెను. వార్త ఓరుగల్లు చేరులోపలనే మిడుతలదండువలె తుఱకదండు దుర్గమును చుట్టుముట్టెను.

ఆంధ్రవీరుల విస్మయాశ్చర్యముల కంతులేదు. ఇటులగునని వారు కలనైనఁ దలఁచియుండలేదు. విద్యామంటపమందలి వీరులు గంటముల వదలి సంభ్రమముతో ఖడ్గములు పట్టిరి. కాని లాభమేమి? సర్వసన్నాహములతో వచ్చిపడిన వారు తురుష్కులు; రసార్ద్రహృదయములతో ఆదమఱచియున్నవారు తెలుఁగువారు.

పైఁగా తురుష్కులయొద్ద తోపులుండెను. కోటగోడలకన్న నున్నతములగు మంచెలు వైచుకొని తురుష్కులు కోటలోనికి కగ్నివర్షము కురిపించుచుండిరి. మట్టికోట మగ్గిపోయెను. ఱాతికోట బురుజొకటి తుఱకల చేతఁబడెను.

విజయముచేసెను. ఇందు తీర్థయాత్రా ఫలితమేకాక విజయ యాత్రాఫలితమును సిద్ధించి చక్రవర్తి భండారము పరిపూర్ణ మయ్యెను.

ఈ సమయముననే ఒరిస్సాపాలకుఁడగు కపిలేంద్ర గజపతి తెలంగాణముమీఁది కెత్తి వచ్చెను. చక్రవర్తి రాజధానిలో లేక పోయినను ఏకశిలానగర పాలకుఁడయిన నాగయగన్నమంత్రి యెదురొడ్డి నిలిచెను. దేవరినాయకుఁడు మున్నగు పద్మనాయకవీరులు సాటిలేని పరాక్రమము నెఱపి ఓఢ్రులను తఱిమికొట్టిరి.

పిమ్మట ప్రతాపరుద్ర చక్రవర్తికి కంపిలి రాజ్యాధిపతి యగు కుమార రామునితో యుద్ధము తటస్థించెను. అతఁడు 'వీర రుద్రనగండ' యను బిరుదము ధరించి చక్రవర్తి నవ మానించెను. రేచర్ల సింగమనాయకుఁడు, బెండపూడి అన్నయామాత్యుఁడు నీ యుద్ధమునఁ బాల్గొనిరి. వారు విజయలక్ష్మితోఁగూడ నాఱువందల యశ్వములను కానుక తెచ్చి చక్రవర్తి మన్నన లందిరి.

ఇట్లీ యెనిమిది సంవత్సరములు విజయ పరంపరలతో నిండిపోయెను. తదుపరి జరిగిన విషాద కథనమువలన నీవెలుఁగు ఆఱిపోవునప్పటి దీపపువెలుఁగనిపించును.

౫

ఢిల్లీలో ఖిల్జీసుల్తానుల పాలన మంతరించెను. తుగ్లకు సుల్తానులు సింహాసన మెక్కిరి. మొదటి తుగ్లకు చక్రవర్తి గయాసుద్దీను. అతఁడు తన కుమారుఁడైన జూనాఖానును దక్షిణాపథ విజయమునకై గొప్పసేనలతోఁ బంపెను.

ఈ వార్త చారులవలననెఱింగి ప్రతాపరుద్ర చక్రవర్తి తగు సన్నాహములు సలిపెను. పద్మనాయక వీరులందఱును తమతమ బలములతో వచ్చి నిలిచిరి. అందఱిదృష్టియు నుత్తరమునుండి వచ్చు తురుష్కవాహినులపై నుండెను.

ఇంతలో తమయం దభిమానములేని ప్రతాపరుద్రదేవుని గూలఁద్రోసి స్వాతంత్ర్యముఁ బ్రకటించుట కిది తగిన సమయమని రెడ్డినాయకులు పలువు రభిప్రాయపడిరి. వారికి ప్రోలయ వేమారెడ్డి నాయకత్వము వహించెను. ధరణికోటలో స్వాతంత్ర్య ప్రకటనము జరిగెను. జడిగములో మిడతపోటు వలె నేర్పడిన యీ యొత్తొరవును ద్రొలఁగించుటకై చక్రవర్తి యొక చిన్నసేనను పంపెను. కాని రెడ్డివీరులధాటి కది వకావక లయ్యెను. ఇంతలో తురుష్కులదాడి సమీపించుటచే చక్రవర్తి కిటు దృష్టిమఱల్చుట కవకాశము లేకపోయెను. కొలఁదిమంది రెడ్డినాయకులు మాత్రమే చక్రవర్తిసేనలోచేరి నిలిచిరి.

తురుష్కబలము లోరుగంటిని చుట్టుముట్టెను. ఆంధ్ర వీరులు మొక్కవోని పరాక్రమము నెఱపుచుండిరి. కాని

యెదిరిబలము సమధికముగ నుండెను. కేవలము పరాక్రమ మక్కఱకు వచ్చునట్లు కనిపించలేదు. చక్రవర్తి ప్రధానులతో మంతనము సలిపెను.

ఢిల్లీసుల్తాను గయాసుద్దీను తుగ్లకు హత్యచేయబడినట్లు ప్రబలమగు వదంతి బయలుదేరెను. దానితో తురుష్క సైన్యము సరదారులతోఁగూడ చెల్లాచెదరై ఢిల్లీముఖముపట్టెను. ఆంధ్రనగరి కప్పటి కూపిరితీసికొనుట కవకాశము లభించెను.

జూనాఖాను దేవగిరి చేరుకొనెను. ఈ వార్త ఢిల్లీ పాదుషావఱకును ప్రాఁకెను. అతఁడు నిరుత్సాహ పడలేదు. మహత్తరమైన సైన్యమును సిద్ధపఱచి కుమారునికడకుఁ బంపెను. జూనాఖానునకుఁ గలిగిన ఆనందమునకు మేరలేదు. అతఁడు సమధికోత్సాహముతో మరల నేకశిలానగరమును ముట్టడించెను. ఈ తడవ తురుష్కులపట్టుదల చెప్పఁదరముకాదు.

రెడ్డివీరులు పలువురు ధరణికోట విప్లవమునఁ బాలుగొను చుండిరి. చక్రవర్తి సేనలో బొబ్బరెడ్డి నాయకత్వమున కొందఱు రెడ్డినాయకులుండిరి. బొబ్బరెడ్డికి పద్మనాయకుల పరాక్రమమునెడల మత్సరము. పద్మనాయక వీరులు ముందంజవైచి ప్రాణములకు తెగించి పోరాడుచుండిరి. వారం దఱును తురుష్కులచేత నిహతులయినపిదప తాము పరాక్రమించి చక్రవర్తి మెప్పులొందవలెనని రెడ్డినాయకులు నిశ్చయించుకొనిరి. అందుచే వారు యుద్ధరంగమునకు దూరముగఁ దొలఁగి యుండిరి. ఆ మహాసంగ్రామమున నిది యితరులు గ్రహించుట కవకాశమెక్కడ ?

డస్సిపోవుచున్న పద్మనాయక మహావీరులను గాంచి ప్రతాపరుద్ర చక్రవర్తి యింక నిలువఁజాలక పోయెను. మద గజారూఢుఁడై మూలబలములతోఁ గదలి ప్రళయరుద్రుఁడో యన రణరంగమున నవతరించెను. తెలుఁగువీరుల శరీరములు పొంగెను. సంకులసమరము జరిగెను.

ఇంతలో జూనాఖాను సరదారులతో ప్రతాపరుద్రుని చుట్టుముట్టెను. సైన్యము లోడలెఖ్ఖింగని యావేశముతో తురుష్క-వాహినులను చెండాడుచుండెను. కొలఁదిసేపటిలో ప్రతాపరుద్రునకును, సైన్యమునకును ఎడఁబాటు కలిగెను. ఈ వ్యూహసంఘటనమువలన ప్రతాపరుద్రచక్రవర్తి క్షీణబలుఁడై జూనాఖానునకుఁ జిక్కెను. జూనాఖాను వెంటనే ప్రతాపరుద్రుని బంధించి రహస్యముగా ఢిల్లీకిఁ బంపివేసెను. ప్రతాపరుద్రుని భౌతికశరీరము మాత్రమే ఢిల్లీ చేరెను. పవిత్రాత్మ యెప్పుడో ఈ తుచ్ఛప్రపంచమును వీడెను.

ఆంధ్రవీరుల కీ సంగతి తెలియునప్పటి కంతయు చేయి దాటిపోయెను. పద్మనాయకవీరులు చేయునదిలేక యుద్ధము విరమించిరి. ఈపరిణామములను గమనించుచున్న బొబ్బారెడ్డి ప్రభృతులకు తమ తప్పు తెలిసివచ్చెను. చేతులుకాలినపిమ్మట ఆకులకై అఱ్ఱులుసాచిరి. ప్రాణములకు తెగించి తురుష్కులతోఁ బోరిరి. అందఱును రణరంగమునకు బలియైరి.

మున్నూరు సంవత్సరములు ముమ్మరముగా వెలిఁగిన తెలుఁగు సామ్రాజ్యము తురుష్కుల హస్తగతమయ్యెను. ఈ

పతనమునకు జైనులుగూడఁ గొంత దోహద మొనర్చియుండిరి. పరమ మాహేశ్వరులయిన కాకతీయులు జైనులను పలువిధముల హింసించిరి. అందును ప్రతాపరుద్రదేవుఁడు ఏడాకు లెక్కువ చదివెను. అందుచే వారు సుల్తానుతో కుట్రచేసి యింటిగుట్టు తురకల కందించిరి.

ఈ విధముగా "అరయంగా కర్ణుఁడీల్గె నార్గురి చేతన్" అన్నట్లు కాకతీయసామ్రాజ్యము విచ్ఛిన్నమయ్యెను.

---

# ౮. మృతజీవి

## ౧

కరకర రెండుజాముల ప్రొద్దెక్కెను. సూర్యుఁడు నడిమింటిపై వీరవిహారము సలుపుచుండెను. ఎడనెడ నొండొక మబ్బుతెర యడ్డుపడుచుండెను. అదియొక యడవిబీడు. పశువులమంద మేఁతమాని నీడపట్టుల నెమరువేయుచుండెను. కాఁపరుల కొక్కింత విశ్రాంతి లభించెను. వారొక వాఁగుదరి గుమిగూడి బువ్వమూటలు విప్పిరి. లొట్టలుగొట్టుకొనుచు చల్దు లారగించి మఱ్ఱిచెట్లనీడల రవంత యొడ్డిగిల్లిరి. కూటికి గుడ్డకు రాని లోకాభిరామాయణము లేమేమో దొర్లిపోవుచుండెను.

సీతఁడొక బోయపిల్లఁడు. అతఁడు ప్రొద్దుటినుండి గొడ్లను మళ్ళవేయుట కటునిటు పర్వులెత్తి యలసిపోయెను. అతఁ డానాఁడేలొకో పగటిబువ్వ తెచ్చుకొనలేదు. తేపతేప కాతని జూడ్కు లూరిబాటవైపేమో నెమకుచున్నట్లుండెను. అంతలో నిదురమత్తు ముంచుకొనివచ్చి యాతఁడొక పొదమాటున మేనువాల్చెను.

అది రాజపూడియను నొకపల్లె. కిమూరుబస్తీ యచ్చటి కెనిమిదిమైళ్ళ దూరముననుండెను. అవసరాల పెద్దిరాజు రాజపూడికి పేరుమోసిన యొక నియోగి బ్రాహ్మణుఁడు. సీతఁ డాయనకడ దినబత్తెమునకు గుదిరి గొడ్లను గాయుచుండెను.

నాఁడేదో యిబ్బందికలిగి యజమానురాలు సీతనికిఁ బగటి యన్నము గట్టియిచ్చుటకు వలనుపడదయ్యెను. పాలేళ్లంద ఱెవరిపనులపై వారు వెడలిపోయిరి. అందుచే పెద్దిరాజే యన్నముపట్టుకొని యడవిబీటికి వచ్చెను.

సీతఁడు కళ్ళఁబడఁగనే పెద్దిరా జులికిపడి కొయ్యబొమ్మ వలె నిలిచిపోయెను. అతఁడట్లు నివ్వెఱపడుట కేమికారణమో! సీతఁడు పొదమాటున నీరెండలోనేపరుండి గుఱ్ఱుపెట్టుచుండెను. అతని ముఖముపై నెండపొడ పడకుండ నొక నాగుబాము పడగవిప్పి గొడుగువలె పట్టియుండెను. పెద్దిరాజు కాళ్ళు తడబడెను. ముచ్చెమటలు గ్రమ్మెను. అప్రయత్నముగ నతనినోట నొక వెఱ్ఱికేక వెలువడెను. ఆ యలికిడి విని సర్పము దాపున నున్న పుట్టలోఁబడెను. బ్రాహ్మణుని ప్రాణములు కుదుటఁబడెను.

పెద్దిరా జంతట సీతనిలేపి బువ్వపెట్టి నీరు ద్రావించెను. పాపము! బోయబాలకుఁడు గబ్బున త్రెళ్ళి పశువులజాడ గనుగొనుటకై లేచెను. బ్రాహ్మణుఁ డాతని కేలువట్టికొని "ఓరీ! నీకు గొప్ప రాజయోగము పట్టనున్నది. నాకప్పు డేమి యుపాయన మొసంగెదవు?" అని ప్రశ్నించెను. "దొరా! మీ మోచేతిగంజి దొరకుట నాకు రాజయోగముకాక మఱేమి? ఎకసక్కెములతో ఏలనన్నుడికించెదరు?" అని సీతఁడు బిడియముఁ జూపెను. పెద్దిరాజు తాఁగన్న వింత యాతని చెవిలో నూఁది "సీతన్నా! నాయంచనా తప్పకానియెడల ననతికాలములో నీకు రాచఱికము లభింపఁగలదు. మాసిపోయిన తెలుఁగు తేజస్సు నీవలన మఱొక్క వెలుఁగు వెలుఁగునేమో! ఎవరు చెప్పఁగలరు?"

అని హెచ్చరించెను. సీతఁడు నవ్వుచు "తమ చలువచే నంతటి యదృష్టము పట్టనిండు. నాదంతయు మీాయదియే!" అని మాఱుపలికెను.

సీతని స్థితి నాఁటగోలె పూర్తిగ మాఱిపోయెను. సీతఁడు సీతాపతి యయ్యెను. బోయకుఱ్ఱఁ డిప్పుడు పెద్దిరాజుకడ నాలకాపరి కాఁడు. ఆయన శిష్యులలో ప్రప్రథముఁడు. బ్రాహ్మణుఁ డాతని సానబట్టిన జాతిరత్నముగఁ దయారుచేసెను. సీతఁ డనతికాలమున నెల్ల చదువులకుఁ గాణాచి యయ్యెను. సాముగరిడీలలో నాఱితేరిన మొనగాఁ డనిపించుకొనెను. ఏమి కాలమాహాత్మ్యము! రాజపురి వాస్తవ్యులు అమాయకుఁడుగ నున్న బోయసీతని జూచిరి. రాజస ముట్టిపడుచున్న సీతాపతిని జూచిరి. ఆతఁ డికముం దెట్టి వాఁడుగ వారికి నేత్రపర్వ మొనర్పవలసి యుండెనో!

ఇట్టిసమయమున గోలకొండనుండి రాజమహేంద్రవరమున కొక రాజోద్యోగి వచ్చెను. ఆయనను సర్ లష్కర్ అని పిలుచుట పరిపాటి. సీతాపతి యాతనిదృష్టి నాకర్షించెను. సర్ లష్కరాతనిఁ జేరఁదీసి తనకొలువులోఁ జేర్చుకొనెను. అధికారుల మన్ననలతో సీతాపతి యుక్కిరిబిక్కిరి యయ్యెను. తొలుత నిరువదిమందికి నాయకుఁడుగానున్న యాతఁడు రెండు వందలమంది సిపాయిలకు సరదారయ్యెను.

ఆరోజులలో జగ్గంపేట, పాదిలి మున్నగు కొండప్రాంతముల కోయవాండ్రు తిరుగుబాటు చేసిరి. సీతాపతి యైదువందల సైనికులతో మన్నెప్రాంతపు ఠాణాకు ముఖ్యపాలకుఁడుగ నియో

గింపఁబడెను. అతఁడు తనశక్తిని బ్రకటించి యరణ్యప్రాంతముల నన్నిఁటిని గైవసముచేసికొని యా పితూరీ నణచివైచెను. రాజ పూడియొద్ద జాతికోటఁ గట్టించి తగిన బందోబస్తులు చేసెను.

బహామనీ రాజ్యమును హుమాయూన్‌షా పరిపాలించు చున్న రోజులవి. సీతాపతి విజయవార్తలు క్రమముగాసుల్తాను చెవిని బడెను. సీతాపతి సహజముగ ధైర్యస్థైర్యములకు, వ్యవ హారదక్షతకుఁ బెట్టినదిపేరు. సుల్తానాతనియెడఁ బ్రసన్నుఁడగుట కెంతోకాలము పట్టలేదు. రాజుల కాగ్రహము వచ్చినను, అనుగ్రహము వచ్చినను పట్టపగ్గములుండవు. హుమాయూన్‌షా సీతాపతి నోరుగల్లునకు రాజప్రతినిధిగ నియమించెను. పితాబు ఖానను బిరుదమొసంగి గౌరవించెను. ఆహా! దైవలిఖిత మున్న ప్పుడు పైకెక్కివచ్చుట కెట్టియాటంకములు నుండవు. మిాఁదు మిక్కిలి మార్గములుకూడ వాటంతటవని యెల్లెడలను గోచ రించుచుండును. నిచ్చెనమెట్లెక్కినట్లు సీతాపతి యభ్యుదయ పరంపరలతో నున్నతస్థాన మధిరోహించెను. ఖానఁగా శూరా గ్రేసరుఁడు. పితాబ్ అనగా నభ్యుదయము. పితాబుఖాన్ బిరు దము సీతాపతియం దన్వర్థమయ్యెననుట యతిశయోక్తి కానేరదు.

రాజప్రతినిధి కాఁగల్గిన సీతాపతి గతచరిత్రమును విస్మ రింపలేదు. చిన్ననాఁటి రాజపూడి జీవితము, పెద్దిరాజు పెంప కము నాతని డొక్కలో మెదలుచునేయుండెను. ఓరుగంటిలో తాను స్థిరపడఁగనే పెద్దిరాజును బిలిపించుకొని యమాత్యపదవి నొసంగెను. పెద్దిరాజుకూడ 'తనచేతులలో పెరిఁగిన బోయపిల్లఁ

డింత యుచ్ఛదశకు వచ్చెఁగదా' యని సంబరపడెను. సీతాపతికిఁ జేదోడువాదోడుగా నుండి పెద్దిరాజు మిక్కిలి ప్రఖ్యాతి గడించెను. ఆయుభయుల కలయిక తెలుఁగుబావుటా మరల నేకశిలానగరముపై బ్రతిష్ఠింపఁబడుటకు దోహదముకలిగించెను.

## ౨

నాఁడు శాలివాహనశకము 1425 సం॥రము మాఘ శుద్ధపంచమి ఆదివారము అనఁగా క్రీ. శ. 1504 సం॥ రము జనవరి 21 తేది. ఏకశిలానగరము సముజ్జ్వలముగ నలంకరింపఁ బడెను. పౌరులందఱు నృత్తగీతవాద్యములతో నుత్సవము జరిపి కొనిరి. తెలంగాణమున క్రొత్తయాశాజ్యోతి క్రొంగ్రొత్త తేజస్సు వెల్లివిరిసెను. తెలుఁగువారు నిండుగర్వముతో దలయెత్తి తిరుగాడఁ దొడఁగిరి.

కాకతి ప్రోలరాజు స్థాపించిన యాంధ్రసామ్రాజ్యము ప్రతాపరుద్రుని యనంతరము వకావకలయ్యెను. మహమ్మదీయ దండయాత్రలతో నావీరగడ్డ బీటలువాఱిపోయెను. దాస్య శృంఖలములకుఁ గాలుసేతు లప్పగింపవలసినదుస్థితి ఏర్పడెను. షితాబుఖాన్ సీతాపతి యప్పుడా యుక్కుతెరల నన్నిఁటిని భేదించివైచెను. శత్రువుల పిడికిలినుండి తెలంగాణమును విముక్తము గావించెను. ఓరుగంటిరాజ్యమునకు స్వాతంత్ర్యము ప్రకటించి తెలుఁగుజెండా నెగురవైచెను. అందులకే తెలుఁగు ప్రజల యా సంరంభము - తెలుఁగునాఁట నా యానందము.

కాలగతిననుసరించి బహమనీరాజ్యము భిన్నాభిన్న మయ్యెను. ఏకచ్ఛత్రాధిపత్యము నశించి యయ్యది రాజ్యపంచకముగ విడిపోయెను. ఓరుగల్లు గోలకొండ నవాబగు కులీకుతుబ్‌షా వంతునకు వచ్చెను. సీతాపతి యప్పటికే తగిన కట్టుదిట్టములు చేసికొనియుండెను. దేశకాల పరిస్థితు లనుకూలముగ నుండెను. చేఁజిక్కిన యవకాశమును సీతాపతి సక్రమముగ వినియోగించుకొనెను. ఆంధ్ర సామ్రాజ్యమును పునరుద్ధరించుటకుఁ గంకణము గట్టుకొనెను. దానికి నాందియే యీ స్వాతంత్ర్య ప్రకటనము.

షితాబుఖాన్ బిరుదము వహించినను సీతాపతి పదునారణాల ఆంధ్రుఁడు. హుమాయూన్‌షా కొలువులోనున్నను ఆతని నరనరమున పొంగులువాఱునది ఆంధ్ర రక్తమే. బోయ పిల్లఁడుగా నున్నప్పుడేమోకాని జ్ఞాననేత్రము తెఱపిడికి వచ్చినప్పటినుండి యతనిలో నిద్రాణమైయున్న యాంధ్రత్వము మేల్కొనెను. ఓరుగల్లు రాజప్రతినిధి యగుటతో నాంధ్ర చైతన్య మాతని కార్యరంగమున కుఱికించెను.

ఓరుగల్లు సింహపీఠిక యల్పమైనదికాదు. కాకతీయ రాజులు దాదాపు మున్నూఱు సంవత్సరము లవిచ్ఛిన్నముగ స్వాతంత్ర్యజ్యోతి వెలిఁగించిన స్థానమది. దానిపై నొక తెనుఁగు వాఁడు కూర్చుండి తెనుఁగు ప్రజపై పరాయిపెత్తనము నమలు జరుపఁగలఁడా? కల్ల. శత్రువుల దండయాత్రలలో శిథిలావస్థకుఁ బాల్పడిన దేవాలయశిల్పములు తెనుఁగువీరుని నిద్ర పోనిచ్చునా? అసంభవము. సీతాపతి కాంధ్రోద్యమమునుగుఱించి తహతహ

హెచ్చెను. సామ్రాజ్య పునరుద్ధరణమునకై కలలు గనుచుండెను. కాకతీయగాథలు నెమరునకు దెచ్చుకొని యావేశపడుచుండెను. ఒకనాటి వేకువ ప్రతాపరుద్రుఁ డాతనికి స్వప్నమున సాక్షాత్కరించెను. దానితో నాతఁడు ప్రత్యక్షచర్యకు గడంగెను.

కార్యశూరుఁడగు సీతాపతి యెట్టకేలకు స్వతంత్ర రాజ్యమును స్థాపించెను. అయ్యది వరంగల్లు, బెల్లంకొండ, ఖమ్మమెట్టు మున్నగు గిరిదుర్గములు కలిగి కృష్ణానది కిర్వంకల గుంటూరిసీమవఱకు వ్యాప్తిచెందెను. ఐన నిది యాఱేడు సంవత్సరముల భోగము మాత్రమే. కాని యీమూఁడునాళ్ల ముచ్చటలోనే సీతాపతి తెలుఁగు తేజస్సును దిక్కుల వెలయించెను. ఆతని వీరగాథలు కవులగంటములకు పనిచెప్పెను.

సీతాపతి స్వయంభూదేవాలయమును బాగుచేయించెను. కాకతీయులకు రక్షకముగనున్న పరుసవేది లింగమును బూజించి యతులితైశ్వర్యముల ననుభవించెను. ముసల్మానుల దాడులలో శిథిలములైన దేవాలయముల నెన్నిఁటినో బాగుచేయించి పూజాదికముల కేర్పాట్లు గావించెను. అతని కళాభిరుచికి గీటురాయియోయన షితాబుఖాను మహాలు నేఁటికిని మన దృష్టి నాకర్షించుచున్నది. అతఁడెంత శూరశిఖామణియో యంతటి ధార్మికుఁడు. ఆతఁడు ప్రతి సంవత్సరమును నృగమహారాజువలె వేయిగోవులను దానముచేయుచుండెనఁట! కవి పండితుల నాదరించి వారి కగ్రహారము లొసంగుచుండెను. ధర్మమును నాలుగు పాదములపై నడపుట కాతఁడు చాయశక్తుల పాటుపడెననుట యత్యుక్తికాదు.

ఆతఁడు ప్రతిష్ఠించిన తటాకములలో పాకాలచెఱువు పేరెన్నిక గన్నది. దానినిగుఱించి యొక యైతిహ్యము ప్రచారములో నున్నది. సీతాపతి కొకనాఁడు మంచి స్వప్నము వచ్చెను. ప్రతాపరుద్రుఁ డందుఁ గనుపడి పాకాలచెఱువులో ధననిక్షేపముగల తావుఁజూపించెనఁట. సీతాపతి దానిని త్రవ్వించి వెలికిదీసెను. అతఁడా ధనమును తటాక నిర్మాణమునకై వినియోగించెను. కరఁగినసీసముతో ఱాతిపలకలను బంధించి చెఱువుకట్టలోని గండ్లు పూడ్పించెను.

ఈ విధముగ పండుగులమీఁద పండుగులుగా జరిగి నన్నాళ్ళు జరిగెను. కాని యింతలో దైవమునకు గన్నుకుట్టెను. సీతాపతిజీవితాకాశమున కాఱుమబ్బులుపొడసూపెను. క్రమముగా నవి తెనుఁగు వెలుఁగునే కబళించి వైచెను.

## 3

“రాణివాసమువారి పవిత్రతను భంగపఱుప నుద్దేశించువాని కేమిశిక్ష?” యని యొకనాఁడు సీతాపతి పెద్దిరాజును ప్రశ్నించెను.

పెద్దిరాజు తటాలున కత్తిదూసి తన కనుగ్రుడ్డను బెఱికివైచికొని “అందు సత్యమావంతయు లేకున్నను ప్రభువు నమ్మినయెడల నట్టివాని కిదేశిక్ష!” యని సగర్వముగ మాఱుపలికెను.

అంతయు కనుఱెప్ప పాటులో జరిగెను. చూపఱు విభ్రాంతిలో మునిఁగిపోయిరి. సీతాపతికూడ నించుక వణఁకినట్లే యగపడెను. ఈ రాజమంత్రుల యంతఃకలహామునకు బీజమెట్టిదియో యెవ్వరికి నంతుపట్టదయ్యెను.

సీతాపతికి దేవాంబిక, అనుమాంబ యను ఇర్వురు దేవేరు లుండిరి. జ్యేష్ఠభార్యయం దాతనికి అవధూత, పురాంతకుఁడు నను కుమారులును, నాగమ్మయను కుమార్తెయుఁగలిగిరి. చిన్నభార్యకు అమరుఁడు, భోగి, రాముఁడు నను పుత్రు లుదయించిరి. నాగమ్మవయస్సునఁదనకు తాతకాఁదగిన పెద్దిరాజుపై మరులుగొనెను. పెద్దిరాజు సీతాపతిని తన కన్నకుమారునివలెఁ జూచుకొను చుండెనుగదా! అట్టివాని పుత్రికను దానెట్లు పరిగ్రహింపఁ గలఁడు? ఆ మహాబ్రాహ్మణుఁడు మోమోటము లేకుండ నాగమ్మ ప్రణయమును నిరాకరించెను.

నాగమ్మ తనకోర్కె వ్యర్థమగుటతో పెద్దిరాజుపై త్రాఁచుపాము పగబట్టెను. ఆమెతండ్రితో లేనిపోని కొండెములు చెప్పి యాతని క్రోధానలమును రగుల్కొల్పెను. మగవాఁడబద్ధ మాడిన దడి కట్టినట్లుండును. ఆఁడుది యబద్ధమాడిన గోడ పెట్టినట్లుండును. సీతాపతి కొమరితమాటకే మొగ్గుజూపి యావేశము జెందెను. అందుచే మంచిచెడ్డల విమర్శించు బుద్ధి సన్నగిల్లెను. అది యెన్నియో యనర్థకములకు దారితీసెను. విధివిధానము తప్పింప నెవరితరము?

పెద్దిరా జవమానభరమునఁ గ్రుంగిపోయెను. అపవాదు వచ్చిపడినందున తన్నుతానే శిక్షించుకొనెను. ‘‘నాపై నిట్టి

సీలాపనిందను మోఁపినందులకుఁ దగిన ఫల మనుభవింతువుగా నిలే" అని యాతఁడు గర్జించెను. పరిజనుని చేయూతఁ గొని యాతఁడు కొలువుకూటమునుండి విసవిస నడచిపోయెను.

దురాగ్రహము కాఱుచిచ్చువంటిది. సర్వనాశనము గావింపకుండ నది యొకపట్టున విడిచిపెట్టదు. అది పూనిన వ్యక్తికి యుక్తాయుక్త పరిజ్ఞానము కొఱవడును. ఔరా! నాగమ్మ చిలిపిచేష్ట యెంతకు దెచ్చినది!

పెద్దిరాజట్లు విగతచక్షుఁడై పల్లకియెక్కి హుటాహుటి గోలకొండకు పయనము సాగించెను. సమయముకొఱ కెదురు చూచుచున్న నవాబాతనికి బ్రహ్మరథముపట్టి స్వాగత మొసంగెను. సీతాపతి యానుపానులన్నియు సుల్తాను గ్రహించెను. ఓరుగల్లుపై దండు విడియుటకు సకలసన్నాహములు పూర్తి కావింపఁబడెను. విభీషణుని తోడ్పాటునఁ గాని శ్రీరాము నంతటివాఁడు లంకారాజ్యమును సాధింపలేకపోయెను. పెద్దిరాజు బాసటయగుటతో గోలకొండవారి కెక్కుడలేని బలము వచ్చెను.

అదను గనిపెట్టి కుతుబ్‌షా సైన్యము లోరుగల్లును ముట్టడించెను. సీతాపతి వెన్నిచ్చి పాఱిపోవు భీరువుకాఁడు. ఆతఁడు తన రాణివాసమును, బొక్కసమును ఖమ్మమెట్టు కోటకుఁ దరలించెను. మధ్యాహ్నసూర్యునివలె దుర్నిరీక్ష్యుఁడై శత్రువులను దాఁకెను. ఆతని ధాటికు శత్రువులు నిలువలేక పోయిరి. సీతాపతి ముప్పది దినములవఱకెట్లో కోటను కాపాడుకొనఁ గల్గెను. కాని తుదకు శత్రువులు మించిన

పట్టుదలతో లోసడుగు పెట్టిరి. ఆ సంకులసమరమున మన సీతఁడు – మన సీతాపతి – మన షితాబుఖాను నేల కొరిగెను. తెనుఁగు బావుటా మరల పడిపోయెను.

గోలకొండసైన్యము లంతతో దనివిసనక ఖమ్మమెట్టు కోటనాక్రమించెను. రాణివాసపుస్త్రీలను హింసించి తనయక్కసు తీర్చుకొనెను. సీతాపతి ధనరాసులన్నియు గోలకొండ ఖజానాకు జేరెను. ఓరుగల్లురాజ్యము కుతుబ్ షా యేలుబడి క్రిందికి వచ్చెను. ప్రతాపరుద్రునితో పతనమైన యోరుగల్లురాజ్యము మరల నొక్కమాఱు తళుక్కునమెఱసి యంతలో కాలగర్భమున నణఁగిపోయెను.

సీతాపతి మృతజీవి. చరిత్రలో ఆతనియంతస్తుసాటిలేనిది.

---

# పరిశిష్టము

## ౧. మార్కోపోలో కథనము

[మార్కోపోలో యాత్రా చరిత్రనుండి]

మాబారును[1] వదలి వేయిమైళ్ళు ఉత్తరదిశగా ప్రయాణముచేసిన ముటఫిలి[2] రాజ్యము వచ్చును. ఇది యొక రాజు[3] పరిపాలనలోనుండెను. నలువది సంవత్సరముల క్రిందట నతఁడు మరణించెను. అంతటినుండి అతనిభార్య[4] యీ రాజ్యమును పాలించుచున్నది. ఆమె మిక్కిలి వివేకముగల యువతి. ఆమె తన భర్తయందలి యనన్యప్రేమవలన మరల వివాహమాడ లేదు[5]. ఆమె యీ నలుబది సంవత్సరములనుండియు తన భర్త వలెనే – అంతకెక్కువగనే – తన రాజ్యమును ప్రశంసనీయ

---

1. మలబారు
2. మోటుపల్లి – ఇది గుంటూరుమండలములో నున్నది. పూర్వము కాకతీయరాజ్యమున నిది ప్రసిద్ధివహించిన రేవుపట్టణముగ నుండెను.
3. మహామండలేశ్వర బేతరాజు. ఇతఁడు గణపతిదేవ చక్రవర్తి రెండవ కుమార్తెయగు గణపాంబభర్త. ఇతఁడు ధరణికోట రాజధానిగా ఆఱువేలనాఁడు నేలెను. ఇది కాకతీయరాజ్యమున నొకభాగము.
4. గణపాంబ.
5. భర్త మరణించినపిదప భార్య మరల వివాహమాడు నాచార మానాఁడు మనదేశములో లేదు. తన దేశాచారపు దృష్టితో మార్కోపోలో యిట్లు వ్రాసియుండును.

ముగా పరిపాలించుచున్నదని ఘంటాపథముగాఁ జెప్పగలను. ఆమె న్యాయైకదృష్టికలది; అందఱను సమానముగా నాదరించునది; శాంతి ప్రియురాలు. ఆమె తన పూర్వరాజుల నందఱను మఱపించునట్లు ప్రజానురంజన మొనర్చినది. ప్రజలు విగ్రహారాధకులు, స్వాతంత్ర్యప్రియులు. వారు మాంసము, శాల్యోదనము, క్షీరము ఆహారముగా గ్రహించుచుండిరి.

వజ్రములు దొరకున దీరాజ్యముననే. అవి యెట్లు గ్రహింపఁబడునో వినుఁడు. ఈ రాజ్యమున కొన్ని యత్యున్నత పర్వతములు గలవు. వానియందు శీతకాలవర్షము లధికముగా కురియును. గిరి శిఖరములనుండి ప్రవాహములు గర్జించుచు క్రిందికి దిగును. క్రమముగా వర్షములు వెనుకబట్టి జలప్రవాహము లాగిపోవును. అప్పుడా ప్రవాహములు వచ్చిన ప్రదేశమునఁ జూచినచో నసంఖ్యాకములగు వజ్రములు కనుపడును. వేసవికాలమునఁగూడ నీ పర్వతములలో లెక్కకు మిక్కిలి వజ్రములు లభించును. కాని అప్పు డీ ప్రాంతముల నడుగిడుట కష్టము. ఎండలు భరింప శక్యముగాకుండును. నాలిక పీకు కొన్నను ఒక్కబొట్టు నీరు దొరకదు. ఆ మహోష్ణమువలన నచ్చట అనేకములగు క్రూరజంతువులేగాక మహాత్తరములయిన సర్పములుండును. మింటి చుక్కలనైన లెక్కపెట్టవచ్చునుగాని వానిని లెక్కింపఁజాలము. ప్రపంచములో అంతటి విషసర్పములింకెక్కడను గానరావు. వాని వాతఁబడి పలువురు ప్రాణములు గోలుపోయిరి. ఆ ప్రదేశమున నడుగుపెట్టఁ దలఁచువారు పరలోక ప్రయాణమునకు సిద్ధపడవలసినదే.

ఈ పర్వతములలో కొన్ని యగాధములయిన లోయలు గలవు. అచ్చటికి దిగిపోవుట కవకాశము లేదు. సాగరాంతరమున నాణిము త్తెములవలె నీ లోయలలో వజ్రములుండును. వజ్రములను సేకరించువారు వీలయినంత సన్నని మాంస ఖండములఁ గొనిపోవుదురు. వాని నా లోయలలోనికి విసరివైచెదరు. ఆ పర్వతములలో తెల్లని రాఁబందు లనేకములు తిరుగుచుండును. అవి యచ్చటి పాములను చంపి తినును. రాఁబందులు మాంసఖండములఁ జూడఁగానే వాని నెగఁదన్ని కొనిపోయి కొండపై నొకచట్రాతిమీఁద బెట్టుకొని తినఁబోవును. కొందఱు మనుష్యు లాకాఁపుదలమీఁదనే యుందురు. రాఁబందులు చట్రాతిపై కాళ్ళుమోఁపఁగనే పెద్ద గందరగోళముచేసి వానిని తఱిమివేయుదురు. పక్షులు పాఱిపోవఁగానే వారు మాంసపు ముక్కలను సంగ్రహింతురు. వానికి వజ్రము లంటుకొని యుండును. మానవులు చొఱరాని ఆ యగాధపు లోయలలో వెల్లికొల్లలుగా వజ్రము లుండుట విచిత్రము. ఎవరైన – ఆశకోలేఁదె ఆ లోయలలో అడుగుపెట్టిరా, వారి నా కొండ చిలువలు కబళించితీరును.

వజ్రములు సేకరించుట కింకొకమార్గముగూడఁ గలదు. జను లా తెల్ల రాఁబందుల గూండ్లకడకుఁ బోవుదురు. అక్కడ సర్పము లెంత మిక్కుటమో ఇవియు నంత యధికముగ నుండును. రాఁబందుల రెట్టలనిండ వజ్రములు దొరకును. అవి మాంసపు ముక్కలతోపాటు వానినిగూడ మ్రింగును. కొందఱు రాఁబందులను సంహరించి వాని గర్భకోశము నందలి వజ్రములు తీసికొందురు.

ఇంతవఱకు వజ్రసంపాదనమునకై యవలంబింపఁబడు చున్న మూఁడుపాయములు చెప్పితిని. మొగలాయి రాజ్యమునఁ దప్ప మఱి యే దేశమునను ఇంత పెద్దవిగాని, ఇట్టి సంఖ్యలోఁ గాని వజ్రములు దొరకవు. మనదేశమునకు జోహారులు తీసికొని వచ్చు వజ్రము లిక్కడ మంచి మంచి వన్నియు నేఱు కొనఁగా మిగిలిన తుక్కురకము మాత్రమే. మేలిరకపు మణులు, ఆణిముత్యములు చీనాచక్రవర్తి కు ఔరంగజేబునకు పంపఁబడును. వివిధ ప్రాంతముల రాజులు, రాజపుత్రులు మంచి మంచి వజ్రములను కొందురు. నిజమునకు ప్రపంచమందలి యమూల్యనిధు లన్నియు వారియొద్దనే గలవు.

ఈ రాజ్యమున మేలిరకపు నాజూకైన వస్త్రములు నేయుదురు. అవి మిక్కిలి వెలగలవి. నిజమున కవి సాలీని యల్లికవలె నుండును. ప్రపంచమున నేరాజుగాని, రాణిగాని వానిని ధరింప నువ్విళులూరని వారుండరు.

ఇచ్చట గొఱ్ఱెలమంద లెక్కువ. ఈ గొఱ్ఱెలు ప్రపంచములోని గొఱ్ఱెలన్నింటికంటె పెద్దవి. ఇంతయేల? జీవితావశ్యకములన్నియు నిచ్చటివారికి కాంతిమాధికములుగఁ గలవని చెప్పుట యతిశయోక్తి కాఁజాలదు.

## ౨. ఏకశిలా నగరము

[‘క్రీడాభిరామము’నుండి నగరవైభవము మాత్రము తెలియునట్లు సంగ్రహింపఁబడినది.]

“వయస్యా! టిట్టిభా! సుప్రభాతము. సుఖనిద్రఁజెందితివిగదా?”

“ఏమిచెప్పుదును? ఈ పుష్యమాఘములందును శీతముపద్రవము వాయకున్నది. గుమ్మడిమూటగట్టినట్లు ముచ్చుముడిఁగి పరుండుటచే ఒడలు నొప్పులు పెట్టుచున్నది”.

“ఔనౌను. ఈ చలిముందు చలిమంట యెండకునుపనికి రాదనిన నీగొంగడు లేమిచేయఁగలవు? పూసికొనిన పునుగు, జవాది, కస్తూరి మైపూఁతలు దండుగే యనిపించినవి”.

“తెలతెలవాఱుచున్నది. ఈ శీతకాలమున కొఱ్ఱయోగిరమును ఇగురావకూరతో కమ్మనినేయి, పెరుగువేసికొని ముద్దయొకమాడచేయు భోజనముచేసిన భాగ్యవంతులు ఇంకను కనులు తెఱచియుండరు. మనము కొంచెమాగి బయలుదేఱుదమా?”

“అదిగో! వృక్షము పూఁగొమ్మననుండి కొదమనెమిలి మాఁగిలి మాఁగిలి షడ్జస్వరముతో ‘కేకో’ యని కూయుచున్నది. కోడి, పట్రింత, నక్క, నెమిలి కనుపడిన మంచిశకునమని పెద్దలు చెప్పుదురు. బద్ధకించిన నెంతసేపయినను ఇంతే. పదపద.”

ఈ సంభాషణ కౌసలనాఁటి బ్రాహ్మణుఁడయిన గోవింద మంచనశర్మకును, అతనిమిత్రుఁడు టిట్టిభసెట్టికిని జరిగినది. వారు పనిమీఁద ఏకశిలానగరమునకుఁ బోవుచుండిరి.

"టిట్టిభా! అటుచూడు. దాసనపువ్వారంగుతో త్రస్తరించుచు సూర్యుఁడుదయించు చున్నాఁడు. అరుణ కిరణములు పదియాఱువన్నె బంగరుతీవలవలె రోదసీకుహరమున వలలు పన్నుచున్నవి. సూర్యబింబము మాణిక్యపు పూర్ణకుంభము వలె నున్నది. ఇదియు మనకొక మంచిశకునమే సుమా!"

"ఔనౌను. అటుచూడు. ఓరుగంటిపుర సౌధముల మీఁద కాంచనకుంభములతో నీరెండలు మంతనములాడు చున్నవి."

"గార్గ్యముని మతమునను సరించి యుషఃకాలము మంచి సమయము. మనము గోధూళిసమయమునకు పురప్రవేశము చేయఁగలము."

వారు పురము వెలిపాళెము ప్రవేశించిరి. అందు మొదట మేదరవాడ యుండెను. క్రొత్తగాఁ దెచ్చిన వంశనాళములును, చీల్చిన వెదురుబద్దలును, సగమల్లిన తడకలు మున్నగునవి కనిపించెను. కోసిన వెదురు బద్దలతో నేసిన నిడుపాటి మంచములు తయారైనవి, కానున్నవి కానఁబడెను. ఈవాడ దాటిపోవు సరికి అగడ్తకు నీళ్లకుఁబోవు వంగనలు వారికిఁ గనఁబడిరి. ఒక ప్రక్కను హరిజనవాటిక యుండెను.

అంతట వారు హట్టమార్గము ననుసరించి పోవుచుండఁగా మైలసంత తగిలెను. అందు నిమ్నజాతులవారికిఁ గావలసిన మత్స్యమాంసాదికములు సమృద్ధిగా విక్రయింపఁ బడుచుండెను. అచట మంచులమ్ము కోయపడుచులు కనుపడిరి.

సంతదాఁటుసరికి హాలికవాటిక వచ్చెను. హాలికాంగన లిండ్లముందు పిడుకలు చేసికొనుచుండిరి.

"మంచనా! అటుచూడు. ఎంతమంది గుంపుగూడి యున్నారో! ఒకరిమీఁద నొకరుపడుచు, ఒండొరులను త్రోచి కొనుచు నీ రేమోచిత్రము చూచుచున్నారు."

"ఏమున్నది? ద్యూతక్రీడా సంరంభమిది. పై యెత్తున నున్నవారు ఎట్లు గొంతు బ్రద్దలు చేసికొనుచున్నారో చూడు."

"ఛీ ఛీ ఈ వ్యాపారములో దిగినవారికి కౌపీనములు మిగులునుసుమా! అబ్బబ్బా! చూడు వారినోటికి తలుపు తాళములు లేవుగదా! అటుచూచినను పాపమువచ్చును. పోవుదమురమ్ము.

"వీరిలో తగుల్బోరి పందెగాండ్రు యమదూతలవంటివారు సుమా! వారు తీయనిమాటలుచెప్పి యెంద అమాయకుల నీ ఋరదగుంటలో దింపుదురో లెక్కలేదు."

క్రమముగా తెలివములవాండ్రయిండ్లు వచ్చెను. కర్ణాట కాంతలు గానుగ పట్టెలమీఁదఁ గూర్చుండి ప్రమోదములతో తిరుపుటెద్దుల నదలించుచుండిరి. కొందఱు కన్నడకన్నెలు ఓరు

గ్రంతఁదిరుగుచు పెద్దయెలుఁగున సంపెంగనూనె యమ్ముచుండిరి.

అటనుండి యుత్తరముగాఁబోవ మోహరివాడ తగిలెను. అందు కుట్రపువారు పలురకముల దుస్తులు కుట్టుచుండిరి. మంచనటిట్టిభులింకను ఉత్తరపువైపుగాఁబోయిరి. ఇండ్లమోసాలలలో అంగనలు తలలుదువ్వుకొనుచు, ఒకరికొకరు ఈరిద్చుకొనుచుండిరి. కొందఱు యువతులు పసపు నూరుకొనుచుండిరి.

వారు వెలివాడ వీధీవిటంకములు గడచి సప్తపాతాళ రాజమార్గమైన పరిఖను దాఁటిరి. ఆకసమంటు ప్రాకారమును సమీపించిరి.

"టిట్టిభా! జాగ్రత్త! ఈ వంకదారయందు జనసమ్మర్దము మిక్కుటము."

"ఈ దారి యింతవంకరగా నెందుకు నిర్మించిరయ్యా! జనులను, శకటములను తప్పించుకొనుసరికి తలప్రాణము తోఁకకు వచ్చుచున్నది."

"ముట్టడిసమయమున దుర్గద్వారమును శత్రుబలములన్నియు నొక్కసారి తాకకుండుట కిట్లు నిర్మించిరని చెప్పుదురు. అదిగో! పెద్దగవని – పసిడితలుపులతో సువర్ణ పక్షివిలక్షణముగు మేరుశైలమువలెనున్నది చూడు."

రాజమార్గమున జనసంబాధము మిక్కుటముగ నుండెను. రథ గజ తురగ శకటములకు విసుఁగు విరామము

లేదు. రాజభటులు, ఉద్యోగులు, వ్యాపారులు-వారువీరన నేల? వివిధ జనసముదయము నేల యీనినట్లుండెను.

"టిట్టిభా! ఈ రాజమార్గమంతయు నిట్లే కోలాహలముగ నుండును. ఎసరేగిన దుమ్ముతో నిండియుండును. కాన మనము క్రొంతత్రోవలవెంట పురమునందలి వింతలుచూచుచుఁ బోవుదము."

ఇరువురును వప్రము క్రింది త్రోవనరిగిరి. అక్కడ పలనాటివీరుల యాలయము కనిపించెను. ఆ యాలయము నెదుట నొక యువతి పలనాటి వీరచరిత్రమును వీరావేశముతో వినిపించుచుండెను. ఆమె ద్రుతతాళమున వీరగుమ్మెటను 'దుందుందుంకిట' యని వాయించుచుండెను. చుట్టును పిన్న పెద్దలు గుంపులు గూడియుండిరి. అందఱును వీర రసోద్రేకము నందు మునిఁగి తేలుచుండిరి. ఒకఁడు ఆలీఢపాద విన్యాసముతో కుంతాభినయము చేయుచుండెను. ఒకఁడు గుఱ్ఱపు కదను త్రొక్కుచుండెను. ఒకఁడు వంత పాడుచుండెను.

"మంచనశర్మా! కథ వినుటకు చాల ముచ్చటగా నున్నది. ఈ పలనాటి వీరులెవరు? వారి గాథయేమి?"

"అదిగో! ఆ ప్రక్క గచ్చుచేసిన చిత్రపుగద్దె పలక మీఁద వ్రాసియున్నది. చూచుకో."

"సరిలే నేను కూడఁబలుకు కొనుచుఁ జదువుసరికి ఊరు మాటు మణుఁగును. ఏదో మూఁడుముక్కలలో నీవు చెప్పుము."

"ఇది మన ప్రతాపరుద్రదేవ చక్రవర్తి ముత్తాతగారి కాలమున జరిగిన సంగతి."

"రుద్రదేవ మహారాజులుంగారి కాలముననా?"

"ఔను. పల్నాటిసీమను పాలించు నలగామరాజు అరువల్లి నాయురాలి వలలోఁ జిక్కెను. అతఁడు తనసోదరులైన మలిదేవాదులతో విరోధము పెట్టుకొనెను. మంత్రియైన బ్రహ్మనాయఁడు నలగాముని మనస్సు త్రిప్పఁ జూచెను. కాని లాభము లేకపోయెను. నలగామరాజు పక్షమున నాయకు రాలును, మలిదేవాదుల పక్షమున బ్రహ్మనాయఁడును కోడిపందెములు వేసిరి. అం దోడినవారు ఏడుసంవత్సరములు ప్రవాసమునకుఁ బోవలెనని నియమముచేసికొనిరి. నాయకురాలి దుస్తంత్రమువలన బ్రహ్మనాయఁ డోడిపోయెను. అతఁడు మలిదేవాదులతో ఏడేండ్లు ప్రవాసము సలిపెను."

"నాయకురాలు దుస్తంత్రము చేసినప్పుడు బ్రహ్మ నాయఁడు సమయము నెందుకుపాటించెను? ఇంత వెఱ్ఱివాఁ డెవఁడైన నుండునా."

"టిట్టిభా! అట్లనకుము. బ్రహ్మనాయఁ డవతార పురుషుఁడు. అతనిని పలనాటికృష్ణుఁ డందురు. ఎట్టి సమయము నను ధర్మాత్ములు సమయము తప్పరు సుమా?"

"చివరి కేమి జరిగినది?"

"ప్రవాసానంతరము బ్రహ్మనాయఁడు మలిదేవాదులకు రాజ్యమున భాగము పంచియిమ్మని నలగామునకు రాయబార

మంపెను. నాయకురాలు పడనీయలేదు. పైఁగా రాయబారిని చంపించెను. అందుచే గొప్పయుద్ధము జరిగెను. బ్రహ్మనాయఁడు వివిధ వర్ణములవారి నేకముచేసి చాపకూడు తిని పించెను. ఐకమత్యముతో వారందఱు యుద్ధమునకు సిద్ధపడిరి. ఈ యుద్ధమున బ్రహ్మనాయని కుమారుఁడగు బాలచంద్రుఁడు చూపిన పరాక్రమము ప్రశంసనీయము."

"అభిమన్యుకుమారునివలెనా ?"

"చక్కఁగా జ్ఞాపకముచేసినావు. కాని చివరకు యుద్ధమున వీరులందఱును మరణించిరి. నాయకురాలు బ్రహ్మనాయనికి లొంగిపోయెను. నలగామఁడు బుద్ధితెచ్చుకొని బ్రహ్మనాయని నాశ్రయించెను. మలిదేవాదులు మరణించి నందున నలగామరాజే చివరకు రాజ్యమేలెను."

"ఔను పోరునష్టము, పొందులాభము నందురుగదా ! కాని పోని కుటుంబ కలహముతో నా వీరగడ్డ రుద్రభూమి యైనది."

ఇట్లు మాటలాడుకొనుచు వారు కొంతదూర మరిగిరి. అచట నొక దేవాలయమునకు నింబపల్లవ నికురుంబముతో తోరణములు గట్టఁబడి యుండెను. అది యేకవీరాదేవి యాలయము. మంచన టిట్టిభు లేకవీరకు నమస్కరించిరి.

"ఔనుగాని శర్మా ! ఈ యేకవీరాదేవి యెవరు ?"

"ఈమె పరశురాముని తల్లియైన రేణుకాదేవి. ఈమె యాలయములు మండపాక, పెనుపాక, మాహురము. నాగ

ధరము, పోలాస మొదలగుచోట్లఁగూడఁ గలవు. మన చక్ర వర్తుల కిలువేల్పయిన కాకతమ్మ కీమె సైదోడు."

"అటు ప్రక్కనేమో కత చెప్పుచున్నట్లున్నది."

"బవినీలు జవనికసాయమున ఏకవీరగాథలు పాడు చున్నారు. అటుచూడు – ఆ మాలెత ఏకవీరమ్మ గాథల గానము చేయుచు ఆవేశముతో నెట్లాడుచున్నదో!"

"అవును – ఆ మొలగంటల గలగల, తాళముల చప్పుడు, తీయని కంఠస్వరము చక్కఁగా కలిసిపోయినవి."

వారికెదురుగా నొక జక్కులపురంధ్రి కామేశ్వరి కథ పాడుచు వచ్చెను. వీరవాద్యములతో నుద్రేకజనకముగాఁ బాడు నాపాట వారిని కొంతసే పరికట్టెను. అక్కడ నొక గృహమేధి సంతానకాంక్షియై, ప్రతిబంధనోద నార్థమై అక్కలకొలుపు సలుపుచుండుట గాననయ్యెను.

పిదప వారు కొంతదూరముపోవుసరికచట నొక యద్భుత దృశ్యము వారి దృష్టి నాకర్షించెను. శృంగనాదములు మిన్నుముట్టు చుండెను. డమరుకములు, డిండిమములు దిక్కులు పిక్కటిల్ల మ్రోఁగు చుండెను. గొప్ప కోలాహలము జరుగుచుండెను. జనులు త్రొక్కిసలాడుచుఁ జూచుచుండిరి.

కొందఱు వీరులు అవఅవమందు నెఱ్ఱని చండ్ర నిప్పుల గుండములలో దూఁకుచుండిరి. కొందఱు ఉట్టిలోనుండి, చేరులు కోసికొని, క్రిందఁ బాఁతిన వాఁడిశూలములపై బడు

చుండిరి. కొందరు గాలపుకొంకులకు తమ చర్మము గ్రుచ్చి
కొని, వ్రేలుచు నుయ్యాల లూఁగుచుండిరి. కొందఱు కటిస్థలము
నకు గండకత్తెరపట్టి అయోనాళముల మ్రింగుచుండిరి.
కొందఱు సంధులలో నారసములు గ్రుచ్చుకొను చుండిరి.
ఒకపిల్ల నెట్టికసీలంతలేదు ! – వెనుకకు మొగ్గవ్రాలి నీళ్ల
తొట్టిలో మునిఁగి యందలి ముంగరను ముక్కున
గ్రుచ్చుకొని లేచెను. నాలుకతో నల్లపూసలపేరు గుచ్చెను.
పట్టణ మధ్యమున సింహధ్వజ మెత్తిరి. వేపాకు తోరణములు
గట్టిరి. అంగన లాబాలవృద్ధముగా పూర్ణకలశముల నెత్తికొని
బయలుదేఱిరి. కొందఱు సీధుపానము సలిపి తప్పెట్లు, తల్లెతాళ
ములు పట్టి 'జుకజుంజు' మ్మని వాయించు చుండిరి. ఇది
యంతయు మైలారు దేవర జాతర. సాహస కృత్యములు
సలుపువారు మైలారుదేవర వీరభటులు. మొగ్గలు వేయుచున్నది
గొరగపిల్ల. ఈమైలారుదేవర వీరభద్రునితోడి జోడు.

కొంతదూరము పోవుసరికి వారికి దేవాలయము లనేక
ములు గనిపించెను. భైరవస్వామి యాలయము, చముడేశ్వరీ
శక్తి నగరు, వీరభద్రేశ్వరాలయము, ముద్దరాలు మసానమ్మ
నిలయము, కుమారస్వామి దేవళము, పాండవులగుడి, బౌద్ధ
విహారము కానిపించెను. కొంతదూరమున గోపురముల పైడి
కుండలు మేరుశృంగముల భంగి మెఱయుచుండ కేశవస్వామి
యాలయమును, స్వయంభూ దేవాలయమును గోచరించు
చుండెను. ఆలయములలోనెల్ల నివి విస్తృతములై, విచిత్ర
శిల్ప కళాశోభితములై మనోహరముగా నుండును.

ఇంతలో దివాకరుఁడు నడిమింటఁ జేరెను. పదునాలు గంటలు వినఁబడెను.

"అదిగో! ఆంధ్రసార్వభౌముని మోసాలపై గడియారము పదునాలుగంటలు మ్రోసినది. ఎండ మండిపోవుచున్నది"

"అంతేగాదు. ఆఁకలి మంట యిఁక నాఁపు కొనుట కష్టము. మఱి మనకు భోజనము?"

"అదుగో! ఎవఁడో యొక బ్రాహ్మణుఁడు గఱ్ఱున త్రేన్చుచు తెల్లనాకులు వీడెము చేయుచు వచ్చుచున్నాఁడు. సమీపమున పూటకూటి యిండ్లుండవచ్చును. ఎటు బోవలెనో, యెంతపుచ్చుకొందురో కనుగొందము."

మంచనశర్మ యా బ్రాహ్మణు నడుగగా దాపున లక్ష్మణవఝ్ఝులవారి పూటకూటిల్లు గలదని తెలిసెను. అచ్చట రూక యిచ్చినచో కప్పురభోగి యన్నము, గోధుమపిండివంట, గుప్పెఁడు పంచదార, క్రొత్తగాఁ గాచిన యావునేయి, పెసరపప్పు, అనఁటిపండ్లు, నాలుగైదు నంజులు, అప్పలు, గడ్డపెరుగు వడ్డించెదరని యా బ్రాహ్మణుఁడు తెలిపెను. వారు వెంటనే లక్ష్మణవఝ్ఝులవారి యింటికిఁ బోయి యాకంఠముగా భుజించి విశ్రమించిరి.

కొంతవడికి వారు మరల బయలుదేఱి దారి బట్టిరి. అప్పుడు పుష్పలావిక లెదురు వచ్చిరి. ఒక పుష్పలావిక మంచనశర్మకు గరుడపచ్చల చాయఁ బరిహసించు బాహ్యాపత్రములతోడను, పదియాఱువన్నె బంగరు రంగుగలసంవర్తికా

పలాశములతోడను, కమ్మపుప్పొళ్ళతోడను, గమగమలాడు గేదంగిపూవు నొసంగెను. శర్మయు దాని మూల్యము నిచ్చివేసి, బ్రాహ్మణుల కొక్కొక్కపత్రమునిచ్చి తానొక పత్రమును - చందమామ కొండనాలుకవంటి దానిని - సిగఁ దాల్చెను.

ఎదుట నొక దివ్యహర్మ్యము గనిపించెను. అది రాజప్రాసాదమునకు సోదర్యముగ నుండెను. చందనముతో కలయంపి చల్లిరి. కాశ్మీరమునముగ్గులు పెట్టిరి. ఇందురజమున రంగవల్లికలు వ్రాసిరి. వికచతామరసముల తోరణములు గట్టిరి. "ఇది యెవరి భవన"మని వారొక సమీపస్థునడిగిరి. అతఁడు వీరిని తేటిపాటుఁ జూచి "ఏయూరుమీది? ద్వీపాంతరమునుండి వచ్చితిరా? ప్రతాపరుద్రచక్రవర్తి గోష్ఠినిఁ బ్రతిష్ఠగాంచిన మాచల్దేవి వారాంగన నెఱుంగనివారుగలరా? ఆమె యిప్పుడు చిత్రశాలా ప్రవేశము చేయనున్నది. మీరును ఉత్సవమునఁ బాల్గొనవచ్చునని"ను.

"ఔనోయి టిట్టిభా! ఈ మాచల్దేవి జగద్విఖ్యాతి గాంచినది. ఈమె చరిత్రము నాటకమాడఁగా జూచితిని. లోనికేగి చిత్రశాలను సందర్శించి వత్తము."

"ఈ యింద్రభవనములో నడుగిడుటకే బెరుకుగనున్నది. అయినను లోనివింతలు చూడఁ గుతూహలమగుచున్నది. పద".

ఇరువురును లోనఁ బ్రవేశించిరి. లోన చిత్రశాలా దిదృక్షువులగు జనులనేకు లటు నిటు దిరుగుచుండిరి. పౌరాణిక శృంగార చిత్రము లన్నియు నందుఁ జిత్రింపఁబడి యుండెను.

అదియొక నూతన సృష్టి, నూతనలోకముగ నుండెను. చిత్రకారులకు ధన్యవాదము లొసంగుచు వారు మరల దారిఁబట్టిరి.

ఇంక నాలుగు గడియల ప్రొద్దుండెను. వారు పశ్చిమముగాఁ గొంతదూరము పోవునరికి పాములాట వినోదము గొలిపెను. పాముల మెంగఁడు కడు వదరుబోతు. మొగమున కస్తూరి చుక్కబొట్టు పెట్టుకొనెను. అడ్డము దిగటముగా నతని యొమ్మున గంధసారస్థాసకము లుండెను. అతఁడు ప్రాతచంద్రిక వన్నె పాగ చుట్టుకొనెను. పాలతెక్కల కుచ్చులు వామకర్ణముతో వరుసలాడుచుండెను. అతనికి పెనుబ్రాముఁ జన్నిదముగా నుండెను. కాలి గండపెండెరము గల్లుగల్లు రనుచుండెను.

అట కదలి మంచనశర్మయు, టిట్టిభసెట్టియు మార్గమధ్యమున గడీని గంతులు చూచిరి. పిదప వాహ్యాళిప్రదేశము చేరునరి కచ్చట మేషయుద్ధము జరుగుచుండెను. ఆ పొట్టేళ్ళు మిక్కిలి జాగ్రత్తతో పెంచినవగుటచే మదించియుండెను. వానికంఠముల గంటలపట్టెడలు గల్లుగల్లున మొరయుచుండెను. వాని మొగముల నాయసపట్టిక లుండెను. అవి మెలిదిరిగిన కొమ్ములకుఁ దగిలింపఁబడి యుండెను. వాని పోరితమున నురలిన నెత్తురు జూడఁజాలక వారు తలఁగిపోయిరి.

కొంతదూరమున కోళ్ళపందెములు జరుగుచుండెను. వారా సజీవద్యూతము గొంతవడి తిలకించి హింసాసంకులమని రోసిరి. సూర్యాస్తమయ మయ్యెను. నాగరకశిఖామణులు కుహాళీచషకముల నారికేళ మధువుఁ గ్రోలి విలాస విహారముల

కుపక్రమించిరి. మంచనశర్మకు సంధ్యావందన సమయమగుటచే
వారు తిరిగి పూటకూటియింటికిఁ జనిరి.

"ఓరుగంటి త్రిసంధ్యలోడ్చిన వెలుగొందు
కాకతీయ ప్రతాపు కంటిమెఱుపు"
— ఆంధ్రరాష్ట్రము

"ఒకనాఁడు తెనుఁగురాజు కిరీటరుచులతో
ఈ మేడ ప్రేలిపోయిన దటంచు,
ఒకనాఁడు తెనుఁగు బిడ్డ కడాని పల్కులో
వీరరేఖలు తాండవించెనంచు,
ఒకనాఁడు తెనుఁగు జోదుకరాగ్రతర వారి
ఎఱ్ఱముత్యాలు వర్షించెనంచు,
ఒకనాఁడు తెనుఁగు రైతు కనుంగొలుకులందు
పచ్చని యశ్రువుల్ పండెనంచు,

తలచి, భావించి, గరువించి, తలలువంచి,
అలమటించిన మాయెదలందుఁ జిందు
ఈ విషాదదుర్భరగీతి నీత్రిలింగ
మున నొక సమార్ద్ర హృదయంబు వినుచుఁగాక !"